

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచిక నుంచి "అహింసాజ్యోతి" అనే పేరుతో గౌతమ బుద్ధుడి జీవితకథ త్రివర్ణ చిత్రాలతో సీరియల్‌గా ప్రచురిస్తున్నాం. బుద్ధుడి బోధల ప్రభావం ఈనాటికీ ప్రజలపైన ఉన్నది. ప్రాణులన్నిటినీ సమంగా భావించి వాటిని హింసించకుండా ఉండటం బుద్ధుడు మానవులకు నేర్పిన గుణపాఠాలలో ఒకటి.

హింస పాపమని నమ్మిన మరొక కుర్రవాడి విచిత్రగాథనుకూడా మీరీ సంచికలో చదవనారంభిస్తారు. ఆ కథపేరు "మూడు పరీక్షలు." అరేబియా దేశంలో బదావీలు రక్తపాతానికి ప్రసిద్ధికెక్కినవారు. అటువంటి జాతిలో పుట్టికూడా కనానా అనే కుర్రవాడు ఒక్కచుక్క రక్తపాతం చెయ్యకుండా వీరాధివీరులను సైతం తలదన్నే సాహసకృత్యాలు చేస్తాడు. ఈ కథ చరిత్రకు సంబంధించినది.

సంపుటి 24 : జనవరి 1959 : సంచిక 1



# అహింసాజ్యోతి

సుమారు రెండున్నరవేల సంవత్సరాల క్రితం భారతదేశంలో పదహారు పెద్ద రాజ్యాలూ, అనేక చిల్లర రాజ్యాలూ ఉండేవి, కొన్ని గణతంత్ర రాజ్యాలుకూడా ఉండేవి. పెద్ద రాజ్యాలలో ప్రధానమైనవి కోసల, మగధ, విదేహ రాజ్యాలు. లిచ్ఛవులూ, శాక్యులూ గణతంత్ర రాజ్యాలు ఏర్పరచుకున్నారు. శాక్యుల రాజ్యం హిమాలయాలకు దిగువగా, సుమారు వెయ్యి చదరపుమైళ్ళ విస్తీర్ణం కలిగి ఉండేది. శాక్యులు కోసలరాజులకు సామంతులు. కపిలవస్తునగరం వారి రాజధాని. శాక్యుల దేశం చాలా అందమైనదీ, సారవంతమైనదీ. దీనికి ఉత్తరాన హిమాలయాల మంచు కొండలుండేవి. దేశమంతటా అందమైన సాలవృక్షాలూ, ఇతర వృక్షాలూ ఉండేవి. మైదానాలలో వరి పుష్కలంగా పండేది.

శాక్యులు క్షత్రియులు. వారికి శుద్ధోదనుడు రాజు. శాక్యులు కోసలరాజుకింద సామంతులే అయినప్పటికీ, ఎక్కువ అభిమానం కలవారు; ఒకరికి సులువుగా తల ఒగ్గేవారు కారు. ఒకప్పుడు ఒక కోసలరాజు తనకు భార్యగా ఉండటానికి ఒక శాక్య కన్యను పంపమని కబురు చేస్తే శాక్యులంతా కూడ బలుక్కుని, తమ కన్యలను వివాహ మాడటానికి కోసలరాజులు అర్హులు కారని తీర్మానించి, ఒక దాసీపిల్లను పంపారు! ఇందుమూలంగా కోసలరాజు కపిలవస్తును బుద్ధుడికాలంలోనే కొల్లగొట్టటం జరిగింది. శాక్యులు అలాంటి అభిమానధనులు.



శాక్యరాజైన శుద్ధోదనుడి పట్టమహిషి మహామాయ, లేక మాయాదేవి. ఆయన రెండవ భార్య మహాప్రజావతి. వీరిద్దరూ వ్యాఘ్రపురరాజు కుమార్తెలు. వీరి గర్భాన ఒక చక్రవర్తి, ఒక అవతారపురుషుడూ జన్మిస్తారని జ్యోతిష్కులు చెప్పటంచేత జంబూద్వీపంలోని అనేక రాజులు వారిని పెళ్లాడగోరారు. కాని వారి తండ్రి వారిని శాక్యరాజైన శుద్ధోదనుడి కిచ్చి వైభవంగా వివాహం చేశాడు.

ఒక ఏడు ఆషాఢసప్తమి నుంచి ఏడు రోజులుగా కపిలవస్తు నగరవాసులు ఆషాఢోత్సవాలు జరిపారు. నగరమంతా ఇంద్రలోకంలాగా అలంకరించి ఉన్నది. వారం రోజులూ నృత్యాది వినోదాలలో ఉల్లాసంగా గడిచిపోయాయి. చతుర్దశినాటిరాత్రి, అంటే ఉత్సవాలు ముగిసిన రోజున, మహామాయ పన్నీట స్నానం చేసి, పుష్పమాలాలంకృత అయి, దానధర్మాలు చేసి, హంసతూలికా తల్పంపై పడుకుని నిద్రపోయి, తెల్లవారు జామున ఒక కల గన్నది. ఆ కలలో ఒక తెల్లఏనుగు ఆకాశం నుంచి దిగివచ్చి, కుడి వైపునుంచి తన గర్భంలో ప్రవేశించినట్టు ఆమెకు కనిపించింది.

తెల్లవారి నిద్ర లేస్తూనే మాయాదేవి తాను కనిన కలను గురించి శుద్ధోదనమహా



రాజుకు చెప్పింది. ఆనాడే శుద్ధోదనుడు అరవైనలుగురు వేదపారంగతులైన బ్రాహ్మణులను పిలిచి, వారికి బంగారు పళ్ళాలలో భోజనాలు పెట్టి, ఆ పళ్ళాలను వారికి కానుకలుగా ఇచ్చేశాడు.

తరవాత ఆయన వారిని మాయాదేవి కలకు అర్థమేమిటని అడిగాడు.

"మాయాదేవి గర్భవతి అయింది. దేశమంతటా ఆనందోత్సవాలు జరిపించండి. ఈమె గర్భవాసాన పుట్టేవాడు ఐహిక జీవితం గడిపితే సామ్రాట్టు అవుతాడు, సన్యసించినట్టయితే మహాబుద్ధుడవుతాడు," అని బ్రాహ్మణులు చెప్పారు.

పది మాసాలూ నిండగానే మాయాదేవి తన భర్తతో, "నా పుట్టింటి వారిని చూడాలని ఉన్నది!" అని చెప్పింది. వెంటనే శుద్ధోదనుడు ఆమె ప్రయాణానికి ఏర్పాట్లు చేయించాడు. కపిలవస్తునుంచి వ్యాఘ్రపురానికి వెళ్ళే దారిపైన ఇసక పోయించి చదును చేశారు. దారిపొడుగునా మంచినీటి సదుపాయాలు చేశారు. బంగారు పల్లకిలో మెత్తలు పరిచి సిద్ధం చేశారు. మాయాదేవి స్నానం చేసి మేలి వస్త్రాలు ధరించి, సర్వాభరణ భూషితురాలై దేవతాస్త్రీలాగా వెలిగిపోతూ పల్లకీ ఎక్కింది. పల్లకిని పట్టడానికి వెయ్యిమంది ఉత్తమ క్షత్రియులు





ఆమె వెంట బయలుదేరారు. ఏనుగులూ, రథాలూ వెన్నంటిరాగా, మంగళ వాద్యాలతో మాయాదేవి తన పుట్టింటికి కదిలింది.

కపిలవస్తునగరం నుంచి వ్యాఘ్రపురానికి వెళ్ళే దారిలో, కపిలవస్తునగరానికి తూర్పుగా 15 మైళ్ళదూరంలో లుంబినీవనం ఉన్నది. ఈ వనం ప్రసిద్ధమైనది. ఇక్కడ విహరించ డానికి రెండు నగరాల ప్రజలూ వచ్చేవారు. పల్లకి లుంబినీవనం చేరగానే మాయాదేవికి అక్కడ కాస్సేపు విశ్రమించాలనిపించింది. ఎందుచేతనంటే అది వైశాఖమాసం; వసంతకాలం. వనంలోని చెట్లన్నీ విరగ బూసి కమ్మని సువాసనలు వెదజల్లుతున్నాయి. పూవుల తేనె తాగుతూ తుమ్మెదలు ఝుంకారాలు చేస్తున్నాయి. చెట్లపైన రంగురంగుల పక్షులు కూర్చుని శ్రావ్యంగా పాడుతున్నాయి.

నిండు చూలాలైన మాయాదేవి ఈ వనంలో ప్రవేశించి దాని అందచందాలు గమనించి ఆనందిస్తూ నడవసాగింది. ఆమె ఒక సాలవృక్షాన్ని సమీపించేసరికి చప్పున ప్రసవం కలిగేలాగు ఆమెకు తోచింది. దేన్నయినా పట్టుకునే ఉద్దేశంతో ఆమె చెయ్యి చాచింది. వెంటనే ఆ సాలవృక్షం కొమ్మ ఒకటి కిందికి వంగి ఆమె చేతికి ఆధారంగా అందింది. ఆ క్షణంలోనే ప్రసవం ఆరంభమయింది.

ఆమెవెంట ఉన్న పరిచారికలు ఆమె చుట్టూ తెరలు అమర్చారు. మాయాదేవి తూర్పుముఖమై కూర్చుని, ఎటువంటి ప్రసవ వేదనా లేకుండా మగశిశువును కన్నది.

ఆనాడు వైశాఖ పౌర్ణమి, మంగళవారం, విశాఖా నక్షత్రం. అదే రోజున కపిలవస్తు నగరంలో యశోధర పుట్టింది; కంటకమనే గుర్రం పుట్టింది; చెన్నుడూ, ఆనందుడూ, కాలుదాయీ అనేవారు పుట్టారు; గయవద్ద బోధివృక్షం పుట్టింది.

[వీరందరికీ బుద్ధుడితో సంబంధం ఉన్నది. యశోధర బుద్ధుడికి భార్య



అయింది. బుద్ధుడు సన్యసించిన నాటిరాత్రి కంటకం అనే గుర్రం ఎక్కి వెళ్ళిపోయాడు. అప్పుడు బుద్ధుడివెంట వెళ్ళినవాడు ఛెన్నుడు. ఆనందుడు బుద్ధుడికి యావజ్జీవ సపర్యలు చేశాడు. సన్యాసి అయిన తన కుమారుణ్ణి ఇంటికి తిరిగి రమ్మని కబురు చేస్తూ శుద్ధోదనుడు కాలుదాయిని దూతగా పంపాడు. గయలోని బోధివృక్షం కిందనే బుద్ధుడు బుద్ధత్వం పొందాడు.]

బుద్ధుడు పుట్టిననాడు అనేక అద్భుతాలు కనిపించాయని చెబుతారు.



దారిలోనే ప్రసవం పూర్తి కావటంచేత మాయాదేవి తన పుట్టింటికి వెళ్ళక, తన శిశువుతోనూ, పరివారంతోనూ కపిలవస్తుకు తిరిగి వచ్చింది.

హిమాలయ పర్వతాలలో అసితుడనే ముని తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఈయన తపస్సు ఏనాడో ఫలించటంచేత సమస్త లోకాలూ, కల్పాలూ ఈయనకు కోరినంతనే కనిపిస్తూ ఉండేవట. బోధి సత్త్వుడు జన్మించిననాడు ఇంద్రలోకంలో దేవతలు ఆనందపారవశ్యంతో నృత్యాలు చేస్తూ ఉండటం గమనించి ఇంద్రపదవికి కొత్తగా మరొకరు వచ్చారేమోనని ఆయన అనుకున్నాడట. కాని ఆయన విచారించగా, కపిలవస్తురాజైన శుద్ధోదనుడికి కుమారుడు కలిగాడనీ, ముప్పైఐదు సంవత్సరాల అనంతరం అతను బుద్ధత్వం పొందనున్నాడనీ తెలుసుకున్నాడట.

వెంటనే అసితుడు కపిలవస్తునగరానికి వెళ్ళాడు. శుద్ధోదనుడు ఆయనకు భక్తితో స్వాగతమిచ్చి, తన కుమారుణ్ణి తెప్పించి, తన చేతులతోనే ఆ బిడ్డను ముని పాదాల వద్ద ఉంచబోయాడు.

కాని ఆ శిశువుకు తన పాదాలు తగిలినట్లయితే తన తల ఏడు చెక్కలుగా పగిలి పోతుందని భావించి అసితుడు ఆ శిశువు పాదాలు పట్టుకుని తన తలకు అనించు





ఉన్నాడు; తరవాత ఆయన ఆ శిశువు చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేశాడు. ఇదంతా చూసిన శుద్ధోదనుడు తానుకూడా తన కొడుకు ముందు ప్రణమిల్లాడు. శుద్ధోదనుడు తన కుమారుడికి చేసిన మొదటి ప్రణామం అదే.

"రాజా, నేను బ్రహ్మకూ, ఇంద్రుడికి కూడా ప్రణామం చెయ్యను. నేను ఆజ్ఞాపించానంటే సూర్య చంద్రులు నిలిచి పోతారు. అయినా నేను శిశువుకు ప్రణామం చేశాను," అంటూ అసితుడు శిశువును పరీక్షించి ఆ శిశువులో ముప్పయిరెండు మాంగల్యలక్షణాలు గమనించాడు. ఆ శిశువు తప్పక బుద్ధుడవుతాడని తెలియగానే అసితుడి ముఖం ఆనందంతో వికసించింది.

తరవాత ఆయన భవిష్యత్తులోకి చూసి ఆ శిశువు బుద్ధుడై తత్వం ఉపదేశించేనాటికి తాను చనిపోయి ఉంటానని, ఆ బోధలు వినే గీత తనకు లేదని తెలిసి కన్నీరు కార్చసాగాడు.

అసితుడు మొదట నవ్వటమూ, తరవాత కన్నీరు కార్చటమూ గమనించిన శుద్ధోదనుడు మొదలైనవారు ఆదుర్దాపడి, "స్వామి, తమరెందుకు విచారిస్తున్నారు? బిడ్డకేమీ ఆపద రాసిపెట్టిలేదుకద?" అని ఆయనను అడిగారు.





"లేదు, లేదు. ఈ శిశువుకు ఎట్టి అరిష్టాలూ రావు. కాని అతను మరి ముప్పై అయిదేళ్లకు బుద్ధత్వం పొంది మానవులకు జన్మరాహిత్యం ఉపదేశిస్తాడు. ఆ ఉపదేశాలు వినటానికి, బుద్ధుణ్ణి కళ్లారా చూడటానికి నేను జీవించి ఉండనే అని విచారిస్తున్నాను." అన్నాడు అసితుడు.

తరవాత అసితుడు తనవారిలో ఎవరికి బుద్ధుడి దర్శనం లభించుతుందా అని ఆలోచించి, తన శిష్యుడూ మేనల్లుడూ అయిన నరదత్తుడికి ఆ అవకాశం ఉంటుందని తెలుసుకున్నాడు. అందుకుగాను ఆ కుర్రవాణ్ణి తయారుచేయాలనుకున్నాడు.

ఆయన నరదత్తుడితో, "నాయనా, నీవు వెంటనే సన్యసించి తపస్సు ప్రారంభించు. బుద్ధుడి బోధలు విని తరించే అవకాశం నీకు లభించగలదు," అని చెప్పాడు.

నరదత్తుడు ఆ ప్రకారమే కాషాయ వస్త్రాలు ధరించి సన్యాసం పుచ్చుకుని హిమాలయాలలో తపస్సు చేశాడు. బుద్ధుడి బోధలు కాశిలో వినే అవకాశం కాలక్రమాన అతడికి లభించింది.

శిశువుకు అయిదవనాడు నామకరణ మహోత్సవం చేశారు. ఆ ఉత్సవం భారీ ఎత్తున జరిగింది. ఎందుచేతనంటే శుద్ధోదన మహారాజుకు ఈ బిడ్డ లేకలేక పుట్టాడు.





ఆనాడు శుద్ధోదనుడు నూటఎనిమిదిమంది బ్రాహ్మణులకు భోజనం పెట్టి పిల్లవాడి జాతకం ఎలా ఉండబోతుందని అడిగాడు. జాతకం గుణించటానికి ఎనిమిదిమంది బ్రాహ్మలు ఎన్నుకోబడ్డారు. వారిలో ఏడుగురు అభిప్రాయపడినదేమంటే ఈ శిశువు చక్రవర్తిగాని బుద్ధుడుగాని అవుతాడని. ఎనిమిదిమందిలోకీ చిన్నవాడైన సుదంతుడనేవాడు మటుకు, "ఈ శిశువు చక్రవర్తి ఎన్నటికీ కాడు, బుద్ధుడే అవుతాడు," అని ఖండితంగా చెప్పేశాడు.

బ్రాహ్మణులందరు కలిసి శుద్ధోదనుడితో, "మహారాజా, ఈ పిల్లవాడి మూలాన ప్రపంచానికి గొప్ప మేలు చేకూరుతుంది. అతని కోరికలన్నీకూడా సిద్ధిస్తాయి. అందుచేత అతనికి సిద్ధార్థుడని నామకరణం చేయండి," అన్నారు.

గౌతముడనేది శాక్యులవంశనామం. అందుచేత శుద్ధోదనుడి కొడుకు గౌతముడని, గౌతమసిద్ధార్థుడని, సర్వార్థసిద్ధి అని కూడా పిలవబడ్డారు.

నామకరణ మహోత్సవంనాడు ఎనభై వేలమంది శాక్యులు ఉత్సవానికి హాజరయారు. వారందరూ శుద్ధోదనుడిలాగే సిద్ధార్థుడు చక్రవర్తి అవుతాడని పూర్తిగా నమ్మారు. కాబోయే చక్రవర్తికి పరివారం కావాలి. అందుచేత వారంతా తమ కుమారులను సిద్ధార్థుడితోపాటు విద్యాభ్యాసం చేయించటానికి నిర్ణయించారు.

సిద్ధార్థుడు జన్మించిన ఏడవరోజున మాయాదేవి జీవితం చాలించింది. శుద్ధోదనుడు తన కుమారుడికి పాలివ్వటానికి నూరుమంది దాదులను ఏర్పరిచాడు. మరీ పొట్టివాళ్ళు కాకుండా, పొడుగువాళ్ళు కాకుండా, అమిత ఆరోగ్యవతులైన వారుగా చూసి ఎన్నో వేలమంది స్త్రీలను పరీక్షించి ఈ దాదులను ఎన్నుకున్నారు.

—(ఇంకా వుంది)





# అహింసాజ్యోతి

[2]

సిద్ధార్థుడు అయిదు నెలల బిడ్డ అయి ఉండగా పొలాలు దున్నే ఉత్సవం వచ్చింది. మొదటి రోజున ఆబాలగోపాలమూ పొలాలకి వెళతారు. మొట్టమొదటగా రాజుగారు బంగారు నాగలితో తూర్పునుంచి పడమరకు ఒక చాలు దున్నుతారు. ఆయన కాడికి కట్టిన ఎద్దుల కొమ్ములకు బంగారు తొడుగులుంటాయి. రాజుగారు మేడిని ఎడమచేత పట్టుకుని, కుడిచేతిలో బంగారు ములుగ్రర పట్టుకుని దున్నుతారు.

రాజుగారు ఒక చాలు దున్నినాక కుల పెద్దలు నూటఎనిమిది వెండి నాగళ్లతో మూడు చాళ్లు దున్నుతారు. వారి నాగళ్లకు కట్టిన ఎద్దుల కొమ్ములకు వెండి తొడుగులూ, వారి చేతులలో వెండి ముల గ్రరలూ ఉంటాయి.

నాలుగు చాళ్లూ పూర్తి అయా మామూలు రైతులు వెయ్యి నాగళ్లతో పొల లన్నీ దున్నేస్తారు. ఈ దున్నటంలో వార పోటీలు పడతారు. ఎవరి చాలు సూటిగా ఉంటే, ఎవరు ఎక్కువ చాళ్లు దున్ని వాళ్లు సమర్థులు!

ఈ ఉత్సవానికి కపిలవస్తు పౌరుల తమకు గల మంచిబట్టలు ధరించి బంగారు, వెండి బిందాలు చేతబట్టి, విస క్రరలూ, కుంచెలూ, తట్టలూ వెంటబెట్టుకు వచ్చారు. రాజకుటుంబమంతా ఉత్సవ చూడరావటంవల్ల నూరుమంది దాదులతో



సహా సిద్ధార్థుణ్ణికూడా తెచ్చారు. ఒక కదిమి చెట్టు నీడలో చుట్టూ తెరలు కట్టి వాటి మధ్యను పిల్లవాడి తొట్టి ఉంచారు. తరవాత దాదులందరూ ఉత్సవం చూడబోయి ఆ ఆనందంలో పిల్లవాడి మాటే పూర్తిగా మరిచిపోయారు.

తిరిగి పొద్దు వాలేదాకా వారికి పిల్లవాడి మాటే జ్ఞాపకం రాలేదు. జ్ఞాపకం వచ్చిన వెంటనే వారు కదిమిచెట్టు వద్దకు పరిగెత్తి అక్కడ ఒక అద్భుతం చూశారట. అదేమి టంటే, అన్ని చెట్ల నీడలూ తూర్పుకు వాలి పోయినప్పటికీ కదిమిచెట్టు నీడ సూటిగా నేలపైన పడుతూ పిల్లవాణ్ణి రక్షిస్తున్నది.

ఈ అద్భుతాన్ని చూసిన దాదులు శుద్ధోదన మహారాజు వద్దకు వెళ్ళి, "మహారాజా, మీరు ఈ ఉత్సవం ఏం చూస్తారు? దీని కన్న వెయ్యిరెట్లు ఆశ్చర్యకరమైన వింత చూతురుగాని రండి!" అని చెప్పి, ఆయనను సిద్ధార్థుడుంటే చోటికి తీసుకుపోయారు. శుద్ధోదన మహారాజు తన కొడుకు ఈశ్వరాంశ సంభూతుడేనని నిశ్చయించుకుని సిద్ధార్థుడి ముందు ప్రణమిల్లాడు.

ఆయన ఆ పసికందుతో, "నాయనా, ఈ మహత్తంతా నా ఎదట ఎందుకు ప్రదర్శిస్తున్నావు? ఈ సమయంలో నీ తల్లి బతికి వుంటే ఈ వింత చూస్తే ఎంత పరవశు రాలయ్యేదో!" అన్నాడు.

సిద్ధార్థుడు బాలచంద్రుడిలాగా దినదిన ప్రవర్ధమానుడవుతూ పెరిగి రాసాగాడు. అంత అల్లారు ముద్దుగా పెరిగే తన కుమారుడు సన్యసించుతాడని జ్ఞాపకం వచ్చినప్పుడల్లా శుద్ధోదన మహారాజుకు పట్ట రాని బాధ కలిగేది.

సిద్ధార్థుడు పన్నెండేళ్ళవాడై ఉండగా శుద్ధోదనమహారాజు కొందరు దైవజ్ఞులను పిలిచి, "నా కుమారుడు ఏయే కారణాంతరాలవల్ల వైరాగ్యం పొందుతాడో చెప్ప గలరా?" అని అడిగాడు.

"మహారాజా! వార్ధక్యమూ, వ్యాధి, మృతి, సన్యాసి—ఈ నాలుగూ చూసి నీ కుమారుడు జీవితంమీద విరక్తి చెందుతాడు," అని దైవజ్ఞులు చెప్పారు.

"నా కుమారుడు చక్రవర్తి కావలసిందే గాని సన్యాసి కావటానికి ఎంతమాత్రమూ వీలులేదు," అన్నాడు శుద్ధోదనుడు. ముసలివాళ్లూ, రోగులూ, శవాలూ, సన్యాసులూ సిద్ధార్థుడి కంట పడకుండా ఉండగలందులకు ఆయన తగిన కట్టుదిట్టాలు చేశాడు.

సిద్ధార్థుడి కోసం మూడు రాజభవనాలు నిర్మించారు. వాటి పేర్లు రమ్య, సురమ్య, శుభ; ఒకటి చలికాలానికి, ఇంకొకటి ఎండాకాలానికీ, మూడవది వానాకాలానికి ఉపయోగించేలాగా వాటిని నిర్మించారు. ఈ మూడు భవనాల చుట్టూ విశాలమైన ఆవరణలున్నాయి. వాటిలో అనేకమంది పహరావాళ్ళను ఉంచారు; సిద్ధార్థుడి కంట పడకూడనివారిని ఆవరణలోకి రానివ్వకుండా చూడటం వారి పని.

సిద్ధార్థుడికి పదహారో ఏడు రాగానే శుద్ధోదనమహారాజు అతని వివాహంగురించి ఆలోచన చేశాడు. కపిలవస్తు రాజవంశంవారు వ్యాఘ్రపుర రాచకన్యలను చేసుకోవటం రివాజు. అందుచేత, వ్యాఘ్రపురరాజైన



సుప్రబుద్ధుడి కుమార్తెను, యశోధరను, తన కొడుకుకిచ్చి వివాహం చెయ్యమని శుద్ధోదనుడు కబురు చేశాడు.

సిద్ధార్థుడు సన్యాసి అయే యోగం ఉన్నదని సుప్రబుద్ధుడికి తెలుసును. అతను సన్యసించినట్టయితే తన కుమార్తె అనాధ అయిపోతుందని భావించి ఆయన శుద్ధోదనుడి కోరికను నిరాకరించాడు. కాని యశోధరమాత్రం సిద్ధార్థుణ్ణి తప్ప మరెవ్వరినీ పెళ్ళాడననీ, అతను సన్యాసి అయినా తనకు అభ్యంతరం లేదనీ అన్నది.

శుద్ధోదనుడు సుప్రబుద్ధుడి తిరస్కారాన్ని లక్ష్యపెట్టక, తానే స్వయంగా వ్యాఘ్రపురానికి

వెళ్ళి యశోధరను వెంటబెట్టుకుని కపిలవస్తు నగరానికి వచ్చారు. తరవాత సిద్ధార్థుడికీ యశోధరకూ శాస్త్రోక్తంగా వివాహమూ, యౌవరాజ్య పట్టాభిషేకమూ జరిపారు. యశోధర సిద్ధార్థుడి పట్టమహిషి; అందుచేత అతనితోబాటు ఆమెకూడా సింహాసనంపై కూర్చుని కిరీటం ధరించింది. ఇదంతా పూర్తి అయినాక శుద్ధోదనమహారాజు శాక్యులందరికీ ఈ విధంగా కబురు పంపాడు: "నా కుమారుడైన యువరాజు సిద్ధార్థుడికి ఉపపత్నులుగానూ, పట్టమహిషి యశోధరకు చెలికత్తెలుగానూ అంతఃపురానికి అవివాహితులైన మీమీ కుమార్తెలను పంపండి!"

అయితే రాజబంధువులు ఇందుకు ఒప్పుకోక, "యువరాజు పసివాడు, చాలా సుకుమారుడు. అతను ఇంతవరకూ ఒక్క క్షాత్రవిద్యకూడా అభ్యసించలేదు. యుద్ధం వస్తే ఇలాటివాడు శత్రువును ఎలా ఎదుర్కొంటాడు? మా కుమార్తెలను ఏవిధంగా పోషించగలుగుతాడు? ఒక్క విద్యా రానివాడివద్దకు మా కుమార్తెలను పంపేది లేదు!" అన్నారు.

తనను గురించి తన కులంవారు ఇలా అన్నారని విని సిద్ధార్థుడు చాలా నొచ్చుకున్నాడు. "నా శక్తి సామర్థ్యాలు ప్రత్యక్షంగా చూడగోరేవారు సరిగా వారంరోజులకు



రాజభవనానికి రావలిసింది!" అని నగర మంతటా చాటింపు వేయించాడు.

అతను నిర్ణయించిన గడువురోజున రాజ భవనం ఆవరణలో బ్రహ్మాండమైన పందిరి వేశారు. అతని బంధుబలగం నూటఅరవై వేలమంది గాక ఇంకా అనేకమంది దాస దాసీజనం అతని అస్త్రనైపుణ్యం చూడటానికి హాజరయారు. అందరూ చూస్తూండగా సిద్ధార్థుడు ఒక బాణం తీసుకున్నాడు. దానికి మామూలు మనుషులెవరూ నారి సంధించ లేరు. అలాటి బాణాన్ని అతను తన కుడి కాలి బొటనవేలుపై నిలబెట్టి ఒక వేలి గోరుతో, కూర్చున్న చోటినుంచి లేవకుండానే, నారి సంధించి ధనుష్టంకారం చేశాడు. ఆ వింటినారి చేసిన మోత ఉరుము చప్పుడు లాగా దశదిశలా ప్రతిధ్వనించింది.

తరవాత సిద్ధార్థుడు ఆ విల్లు ఎక్కుపెట్టి ఒకే బాణంతో నాలుగు అరటిచెట్లను ఛేదించాడు; కళ్ళకు గంతలు కట్టుకుని గురిగా కొట్టాడు; వెంట్రుకకు వేళ్ళాడే వస్త్ర ఫలనుకూడా, బాణంతో వెంట్రుకను తెంపి పడగొట్టాడు. అతను అస్త్ర శిల్పాలలోనూ తనకు పాండిత్యమున్నట్టు అందరి ఎదటా నిరూపించుకున్నాడు.

సిద్ధార్థుడి సామర్థ్యం గురించి శాక్యులు సంతృప్తిపడి తమ కుమార్తెలను సలక్షి





వేలమందిని సిద్ధార్థుడికి ఉపపత్నులుగానూ, యశోధరకు చెలికత్తెలుగానూ ఉండటానికి పంపారు.

సిద్ధార్థుడికిప్పుడు అన్ని సుఖాలూ అందుబాటులో ఉన్నాయి. అతని చుట్టూ ఒక భూలోకస్వర్గం ఏర్పాటయింది. అలాటి స్వర్గసుఖాలలో మునిగితేలుతూ సిద్ధార్థుడు ఒకనాడు తన సారథి అయిన చెన్నుడితో, "ఉద్యానవనానికి పోతాను. రథం సిద్ధం చెయ్యి." అన్నాడు.

చెన్నుడు రథానికి నాలుగు తెల్లని గుర్రాలను పూన్చి తెచ్చాడు. సిద్ధార్థుడు అందులో ఎక్కి ఉద్యానవనంకేసి బయలుదేరాడు.

వారు రాజభవనం దాటి కొద్దిదూరం వెళ్ళారో లేదో, ఒక వింతమనిషి సిద్ధార్థుడి కంట పడ్డాడు. ఆ మనిషి వంగబడి, వణుకుతూ నడుస్తున్నాడు, ఆయన నెత్తిమీది జుట్టంతా నెరిసిపోయింది, నోట్లో చాలా భాగం దంతాలు లేవు.

ఆ మనిషిని చూసి సిద్ధార్థుడు ఆశ్చర్యపడి చెన్నుడితో, "అదేమిటి? ఆ మనిషి అలా ఉన్నాడేం?" అన్నాడు.

"ఆయన ముసలివాడు!" అని చెన్నుడు జవాబు చెప్పాడు.

"అందరిలాగా కాకుండా ఆయన ముసలిగా ఎందుకు పుట్టాడూ?" అని సిద్ధార్థుడడిగాడు. ముసలితనం ఏమిటో కూడా అతనెరగడు.

చెన్నుడు నవ్వి, "ఆయన ముసలివాడుగా పుట్టలేదు. ఒకప్పుడు మనలాగే పడుచువాడు. ముసలితనం రావటంచేత అలా అయాడు," అన్నాడు.

"ఇలాటివాళ్ళు ప్రపంచంలో చాలామంది ఉన్నారా?" అని సిద్ధార్థుడు మళ్ళీ అడిగాడు.

"లేకేం, మహారాజా? చాలామంది ఉన్నారు!" అన్నాడు చెన్నుడు.

సిద్ధార్థుడు కొంచెం ఆలోచించి, "నేను కూడా ముసలితనం వస్తే అలాగే వంగబడి

పోయి, ఆ ముసలివాడిలా వణుకుతూ నడుస్తానా?" అని అడిగాడు.

"బతుకుతూపోతే ప్రతివాళ్ళకూ ముసలితనం వచ్చితీరుతుంది!" అని చెన్నుడు బదులు చెప్పాడు.

"ఉద్యానవనానికి పోవద్దు. రథం వెనక్కు తిప్పు," అన్నాడు సిద్ధార్థుడు. ఈ జీవితంలో చివరకు మిగిలేది ముసలితనమేనా? ఎందుకీ పాడు జీవితం? అనిపించింది సిద్ధార్థుడికి.

తన కుమారుడు అంత త్వరగా రాజభవనానికి తిరిగి రావటం గమనించి శుద్ధోదనుడు కారణ మడిగి తెలుసుకున్నాడు. సిద్ధార్థుడు ఉద్యానవనానికి వెళ్ళే దారిలో ఒక ముసలివాణ్ణి చూసి కలతపడి ఇంటికి తిరిగి వచ్చాడని తెలియగానే ఆయనకు కంగారు పుట్టుకొచ్చింది. ఆయన వెంటనే సిద్ధార్థుడి మనసును ఉల్లాసపరచటానికి నృత్య గాన వినోదాలు ఏర్పాటు చేయించి, అతని భవనాల చుట్టూ ఉండే పహరావారిని రెట్టింపు చేశాడు.

నాలుగు మాసాలు గడిచాయి. మళ్ళీ ఒకనాడు సిద్ధార్థుడు తన రథంలో ఉద్యానవనానికి బయలుదేరాడు. ఈసారి దారిలో అతనికి ఒక రోగిష్టివాడు కనిపించాడు.



ఆ మనిషిని చూస్తూనే సిద్ధార్థుడికి శరీరమంతా కంపించింది.

"ఆ మనిషి అలా ఉన్నాడేం?" అని అతను చెన్నుణ్ణి అడిగి, అతను భయంకరమైన వ్యాధితో తీసుకుంటున్నాడని, ప్రాణులకు వ్యాధులు రావటం సహజమే నని తెలుసుకున్నాడు. ఇదా జీవితమంటే? ఇలాటి జీవితంకోసం ఆశించటం దేనికి? అనుకుని, సిద్ధార్థుడు రథాన్ని తిరిగి ఇంటికి మళ్ళించాడు.

ఈసారి తన కుమారుడు త్వరగా ఇంటికి తిరిగిరావటానికి కారణం అతను రోగిని చూడటమేనని తెలియగానే శుద్ధోదనుడు

మరింత కంగారుపడ్డారు. ఇలాటి దృశ్యాలు సిద్ధార్థుడి కంట పడకుండా చేయటానికి ఆయన సర్వ యత్నాలూ చేశారు.

అయినా సిద్ధార్థుడు మరి నాలుగు మాసాల అనంతరం శవాన్ని చూడనే చూశాడు. అంతకు మునుపు అతనికి చావంటే ఏమిటో తెలియదు. పుట్టిన ప్రతి ప్రాణీ విధిగా చచ్చి తీరుతుందని చెన్నుడు అతనితో చెప్పాడు. ఈసారికూడా సిద్ధార్థుడు రథాన్ని వెనక్కు తిప్పించి ఇంటికి వచ్చే శాడు. దైవజ్ఞులు చెప్పిన మాట నిజమవు తున్నది; శుద్ధోదనుడు దాన్ని ఏమాత్రం వారించలేకపోయాడు.

మరి నాలుగుమాసాలు గడిచాయి. ఆషాఢ పూర్ణిమ దినం వచ్చింది. యశోధర నిండు చూలాలు; ఏ క్షణాన అయినా కనే టట్టుగా ఉన్నది. సిద్ధార్థుడు మామూలు అలవాటు ప్రకారం చెన్నుణ్ణి రథం తెమ్మని, దానిలో ఎక్కి ఉద్యానానికి బయలుదేరాడు. మధ్య దారిలో అతనికి ఒక సన్యాసి కని పించాడు. ఆ సన్యాసి తల గొరిగించుకుని, కాషాయ వస్త్రాలు ధరించి, తల వంచి తాను వెళ్ళే దారిన కొద్దిగజాలదూరం మాత్రమే చూస్తూ నడుస్తున్నాడు. ఆయన ముఖం చూస్తే ఆయన హృదయంలో ఏలాటి రాగ విద్వేషాలూ, వికారాలూ లేనట్టు సిద్ధార్థుడికి కనబడింది.

"చెన్నా, ఎవరీ మనిషి? అందరిలాగా లేడేం?" అని అతను తన సారథిని అడిగాడు.

"ఆ మనిషి సన్యాసి. ఆయన ఐహిక సుఖాలన్నిటినీ విసర్జించి జన్మపరంపర నుండి విముక్తి కాగోరేవాడు!" అని చెన్నుడు జవాబు చెప్పాడు.

సిద్ధార్థుడి మనసు ఒక్కసారిగా తేలిక అయినట్టు కనబడింది. అతను చెన్నుడితో, "రథాన్ని త్వరగా ఉద్యానవనానికి తోలు!" అన్నాడు. —(ఇంకా ఉంది)






## [3]

ఆ రోజు సిద్ధార్థుడు ఉద్యానవనంలో నిశ్చింతగా గడిపాడు. సరస్సులో జలక్రీడలాడాడు, తనకు గల ఉత్తమ వస్త్రాభరణాలను ధరించి ఉల్లాసంగా ఉన్నాడు.

సూర్యాస్తమాన మయింది. సరిగా ఆ సమయానికే యశోధర ఒక మగబిడ్డను ప్రసవించింది. శుద్ధోదనుడు పరమానంద భరితుడయాడు. "ఇది నా కొడుకుకు మరొక నూతనానందం. వాడిక సన్యాసం గురించి ఆలోచించడు," అనుకుని ఆయన, ఈ శుభవార్త చెప్పటానికి ఉద్యానవనానికి ఒక మనిషిని పంపాడు.

తనకు కుమారుడు కలిగాడని వినగానే సిద్ధార్థుడు, "రాహులుడు పుట్టాడా?" అన్నాడు. (రాహులుడు అంటే ప్రేమించ దగినవాడని అర్థం.)

అప్పటికే సిద్ధార్థుడు సన్యసించ నిశ్చయించాడు. జీవితం తెచ్చిపెట్టే రోగాలనూ, ముసలితనాన్నీ, చావునూ తప్పించుకోవాలంటే జీవితంనుంచే విముక్తి పొందాలి, అందుకు సన్యసించటం ఒకటే సాధనగా అతనికి తోచింది. అయినా తన కుమారుణ్ణి ఒక్కసారి కళ్లారా చూసి ఆ ఆనందం అనుభవించి తరవాత సన్యసించుదామని అతను అనుకున్నాడు.

సిద్ధార్థుడు ఉద్యానవనం నుంచి తిరిగి వస్తూండగా కిసాగౌతమి అనే రాజకన్య అతన్ని చూసి ఆనందపారవశ్యంతో—



"నిబ్బుతా నూన సామాతా. నిబ్బుతా నూన సోపితా నిబ్బుతా నూన సానారీ. యస్సాయమ్ ఈ దిసోపతి" అని పొగడింది. ఆ సమయంలో సిద్ధార్థుణ్ణి చూసి అతని తల్లి, తండ్రి, భార్యా ఎంతైనా ఆనందిస్తారని ఆమె భావం. నిబ్బుతి అనే మాటకు సుఖం, లేక క్షేమం (నిర్వృతి) అని ఒక అర్థం; ముగింపు, తిరుగుముఖం కావటం (నివృత్తి) అని మరొక అర్థం.

కిసాగౌతమి చెప్పిన మాటలలో సిద్ధార్థుడికి వైరాగ్యమే ధ్వనించింది. అతను అందుకు సంతోషించి తన మెడలోని రత్నహారాన్ని, లక్ష ఖరీదు చేసేదాన్ని, ఆమెకు బహూకరించాడు. సిద్ధార్థుడు తనను ప్రేమించాడనీ, యశోధరతోబాటు తనను కూడా పట్టపురాణి చేస్తాడనీ, ఆ అమాయకురాలు అనుకున్నది!

సిద్ధార్థుడు ఇంటికి తిరిగివచ్చి అద్వితీయమైన తన హంసతూలికాతల్పంమీద మేను వాల్చాడు. అతనికి ఆనందోల్లాసం కలిగించటానికై స్త్రీలు అతని ఎదట నృత్యాలు చేశారు, పాటలు పాడారు, జంత్రవాద్యాలు వాయించారు. కాని సిద్ధార్థుణ్ణి ఇవేవీ ఆకర్షించలేదు. అతను కళ్లు మూసుకుని నిద్రపోయాడు.

యువరాజు నిద్రపోవటం గమనించి, అతన్ని చుట్టిఉన్న స్త్రీజనం ఆటలూ పాటలూ చాలించి, తాము వాయించిన వాద్యాలపై తలలు ఆనించి ఎక్కడి వారక్కడ నిద్రపోయారు.

కొంతసేపు నిద్రపోయి సిద్ధార్థుడు మేలుకున్నాడు. అతను తన చుట్టూ కలయజూశాడు. తాను నిద్ర పోయేముందు దేవకన్యలలాగా కనిపించిన స్త్రీలు ఇప్పుడు నిద్రలో రకరకాల భంగిమలలో పడుకుని వికారంగా కనిపించారు. నృత్యాలు చేసేటప్పుడూ, అభినయించేటప్పుడూ, పాడేటప్పుడూ వారిలో కనిపించిన సౌందర్యాన్ని నిద్రాదేవత హరించివేసింది.



సిద్ధార్థుడికి తన నిశ్చయం జ్ఞాపకం వచ్చింది. అతను ఉలిక్కిపాటుతో లేచి కూచున్నాడు. అవును, ఈ రాత్రే తాను ఈ ఐహసుఖాలన్నిటికీ వీడ్కోలు చెప్పి సన్యాసదీక్ష పుచ్చుకోవాలి!

ఈ ఆలోచన అతని మనసులో పెరుగుతున్న సమయంలో అతనితో ఎవరో ఇలా అన్నట్టయింది:

"వెర్రివాడా, ఎందుకు సన్యసిస్తావు? ఇంకా ఏడు రోజులలో నీవు ఈ ప్రపంచంలో గల రెండువేల దీవులకూ చక్రవర్తివి కాబోతున్నావు. దశదిశలా నీ అధికారం అమలు జరుగుతుంది. చతురంగ బలాలతో కూడిన అంతులేని సేన నీ చెప్పుచేతలలో ఉంటుంది. అందుచేత విచారం మాని నిశ్చింతగా ఉండు, మనసును ఆనందంతో నింపుకో!"

అయితే ఈ మాటలు సిద్ధార్థుడి కలతను శాంతింపచేయటానికి బదులు రెట్టింపు చేశాయి. ఏడు రోజులకు కాదుగదా, అప్పుడే అతనికి ప్రపంచ సామ్రాజ్యం లభించినా అతను దానిని తిరస్కరించి ఉండేవాడే.

సిద్ధార్థుడు ద్వారంవద్దకు వెళ్ళి, "మెట్ల వద్ద కావలా కాసేది ఎవరు?" అని అడిగాడు. ఆ కేకకు చెన్నుడు ముందుకు వచ్చి, "నేనే ప్రభూ!" అన్నాడు.



"నువేనా? నా గుర్రానికి జీను వేసి సిద్ధంచెయ్యి," అన్నాడు సిద్ధార్థుడు. చెన్నుడు కంటకమనే గుర్రాన్ని సవారీకి ఆయత్తం చేయసాగాడు.

ఈలోపుగా సిద్ధార్థుడు తన కుమారుణ్ణి చూద్దామనే ఉద్దేశంతో యశోధర ఉండే గదికి వెళ్ళాడు. అతను ఆ గది తలుపు తెరవగానే మంచంపై పడుకుని ఉన్న యశోధర కనిపించింది. ఆమె మంచం చుట్టూ పువ్వులు అమర్చిఉన్నాయి. యశోధర గాఢనిద్రలో ఉన్నది. నిద్రలో ఆమె తన బిడ్డను ఒక చేతితో చుట్టి రొమ్ముకు ఆనించుకుని ఉన్నది.





యశోధర చేతిని కదిలించకుండా తన కొడుకును ఎత్తుకోవటం సాధ్యం కాదని సిద్ధార్థుడు గ్రహించాడు. చెయ్యి కదిలిస్తే యశోధర తప్పక మేలుకుంటుంది, మేలుకుని తనను పలకరించి మాట్లాడుతుంది. ఆమెతో కాస్సేపు మాట్లాడినాక, సన్యసించా లన్న తన ఉద్దేశం సన్నగిల్లవచ్చు. సిద్ధార్థుడు వాకిలిమండిగాన్ని చేతితో పట్టుకుని గడప మీదనే ఆగిపోయాడు.

"నేను రాహులుణ్ణి తరవాత చూస్తాను. ప్రాణులు జన్మవిమోచన పొందే మార్గం అన్వేషించటానికి వెళ్ళే నేను ఈ తరుణంలో పుత్రవాత్సల్యానికిగాను నా ఆశయాన్ని పాడు చేసుకోరాదు," అనుకుంటూ సిద్ధార్థుడు వెనక్కు తిరిగాడు. అతను మెట్లు దిగి కిందికి వెళ్ళి, ఇంటిముందు ఆయత్తం చేసి ఉన్న కంటకం అనే గుర్రాన్ని చూశాడు.

కంటకం స్వచ్ఛమైన తెలుపురంగు గుర్రం. దాని నిడివి పద్దెనిమిది మూరలు, దానికి తగినంత ఎత్తుకూడానూ. సిద్ధార్థుడు ఆ గుర్రాన్ని వీపుపై తట్టి ఎక్కాడు. గుర్రం ముందు పోతుంటే చెన్నుడు దాని తోక పట్టుకుని వెనకగా నడిచాడు.

సిద్ధార్థుడు నగరపు బయటి ప్రాకార ద్వారాన్ని చేరుకునేసరికి సరిగా నడిరాత్రి అయింది. ఆ ద్వారపు తలుపులు చాలా



బరువైనవి, అనేకమంది కలిసి నెట్టితేగాని తెరుచుకోవు. అంతేగాక ఆ ద్వారంవద్ద శుద్ధోదనమహారాజు అంతులేని పహారా వాళ్లను కాపు ఉంచాడు. ఈ ఏర్పాట్లన్నీ సిద్ధార్థుడు పారిపోకుండా చూడటానికే. కాని తీరా సిద్ధార్థుడు వెళ్లిపోయే సమయానికి ద్వారపాలకులందరూ నిద్రపోతున్నారు, ద్వారం తెరిచిఉన్నది.

నగరం దాటి కొంతదూరం వెళ్లాక సిద్ధార్థుడు వెనుతిరిగి చూశాడు. పండు వెన్నెలలో కపిలవస్తునగరం దేదీప్యమానంగా వెలిగిపోతున్నది. సిద్ధార్థుడు తన ప్రయాణాన్ని సాగించి తెల్లవారేలోగా మూడు రాజ్యాల పొలిమేరలను దాటి అనోమానది వద్దకు చేరుకున్నాడు. కంటకం ఈ ప్రయాణంలో వేగంగానే పరిగెత్తింది, దాని తోక పట్టుకుని చెన్నుడుకూడా దానితో సమంగా పరిగెత్తాడు.

సిద్ధార్థుడు అనోమానది అవతలి తీరానికి వెళ్లాడు. అది తెల్లని ఇసక ఉన్న ప్రదేశం. అక్కడ అతను తన ఆభరణాలన్నీ తీసి చెన్నుడికి ఇచ్చి, "వీటినీ, గుర్రాన్నీ తీసుకుని తిరిగిపో!" అన్నాడు.

"నన్నెందుకు వెనక్కు పంపిస్తారు? మీవెంట నేనూ వస్తాను. మీతోబాటు నేనూ సన్యసించుతాను," అన్నాడు చెన్నుడు.





"నీవు నా వెంటనే ఉంటే నా వార్త శుద్ధోదనమహారాజుకూ, యశోధరాదేవికి ఎలా తెలుస్తుంది. అందుచేత నీవు కపిలవస్తు నగరానికి తిరిగివెళ్ళి నేను సన్యసించిన సంగతి మా తండ్రిగారికీ, మా పినతల్లి ప్రజాపతికీ, నా భార్యకూ చెప్పు. సన్యసించే అవకాశం ముందు ముందు నేనే నీకిస్తానులే. నాకోసం ఎవరూ విచారపడవద్దని చెప్పు. రాహులుణ్ణి జాగ్రత్తగా పెంచమను. నేను పూర్ణ బుద్ధుడనైగాని వాళ్ళను చూడను," అన్నాడు సిద్ధార్థుడు.

ఈ మాటలు విని చెన్నుడు దుఃఖించి, గుర్రంతోసహా తిరుగుదారి పట్టాడు.



సన్యసించేవారు కేశఖండనం చేయించుకోవాలి. తనకు ఆ పని చేసేవారెవరూ లేరుగనక, సిద్ధార్థుడు తన కేశపాశాన్ని ఎడమ చేత్తో పట్టి ఎత్తి, కత్తితో దాన్ని కోసేశాడు. అతని శిరస్సుపైన రెండంగుళాల జుట్టు మిగిలిపోయిందనీ, అది పెరగకుండా, తరగకుండా యావజ్జీవమూ అలాగే ఉండిపోయిందనీ చెబుతారు.

తరవాత సిద్ధార్థుడు కాషాయవస్త్రాలూ, దండ కమండలాలూ ధరించి సన్యాసివేషం వేసుకుని, అటుగా జనం వచ్చేలోపలనే కదిలి అనుప్రియ అనే పేరుగల మామిడి తోపులోకి వెళ్ళిపోయాడు. అతను ఈ తోపులో ఏడు రోజులపాటు నిరాహారదీక్షలో ఉండి, ఎనిమిదో రోజు ఉదయం అక్కడినుంచి కదలి రాజగృహం అనే నగరానికి వెళ్ళాడు, తూర్పుద్వారంగుండా నగరం ప్రవేశించి భిక్షకోసం ఇల్లిల్లూ తిరిగాడు.

ఈ తరుణంలోనే రాజగృహంలో ఆషాఢ కేళి అనే ఉత్సవం జరిగేది. వీధులనిండా జనం ఉన్నారు. భిక్షకోసం ఇళ్ళముందు నిలబడే సిద్ధార్థుడికేసి వాళ్ళు ఆశ్చర్యంతో చూశారు. వారు అలాటి సన్యాసిని ఎన్నడూ చూడలేదు. రాజగృహానికి రాజైన బింబిసారుడి వద్దకు కొందరువెళ్ళి, "మహారాజా,





మన నగరంలో ఒక వింతవ్యక్తి భిక్షమెత్తుతున్నాడు. ఆయన ఏ యక్షుడో, గంధర్వుడో, గరుడుడో, నాగుడో అయిఉండాలి గాని, మామూలు మనిషిమాత్రం కాదు!" అన్నారు.

"అతను ఎవరైనదీ తెల్సుకోవాలంటే కొందరు అతనివెంట నగరం బయటికి వెళ్లి, ఏం చేస్తాడో గమనించండి. దేవత అయితే మాయమవుతాడు, గరుడుడైతే ఎగిరిపోతాడు, నాగుడైతే భూమిలోకి దూరుతాడు, మామూలు మనిషి అయినట్టయితే తాను భిక్షమెత్తిన ఆహారాన్ని ఎక్కడైనా పెట్టుకుని తింటాడు," అని బింబిసారమహారాజు పౌరులతో అన్నాడు.



ఈలోపుగా సిద్ధార్థుడు తనకు చాలినంత భిక్ష దొరకగానే నగరం వెలపల ఉండే పాండవపర్వతం దగ్గిరికి వెళ్లి, అక్కడ ఒక చెట్టునీడను కూచుని భోజనంచేయసాగాడు. అతను ఇలాటి భోజనం ఎన్నడూ చేయలేదు, జీవితమంతా మృష్టాన్నాలే భుజించాడు. ఇలాటి భోజనం నోటపెట్టుకోవటం మాట అటుంచి, చేత్తో తాకటానికికూడా అసహ్యమనిపించింది. కాని తపస్సులు ఇలాటి కష్టాలను ఎన్నిటినో సహించాలనే నమ్మకంతో అతను ఆ ఆహారాన్ని దిగమింగుతూ, "సిద్ధార్థా, నీ శరీరం బంగారు శరీరం కాదు, ఇందులో అనేక మౌలిక పదార్థాలు కూడిఉన్నాయి. ఈ ఆహారం నీ శరీరంలోకి పోయి పచనమై, జీర్ణమై ఇందులోనుంచి తనకు కావలిసిన అన్నసారాన్ని స్వీకరిస్తుంది. తనకి అదికూడా ఆహారమే!" అనుకున్నాడు.

రాజగృహ పౌరులు కొందరు సిద్ధార్థుణ్ణి వెంబడించి, అతను భోజనంచేయటం గమనించి బింబిసార మహారాజుకు ఆ సంగతి చెప్పారు. బింబిసార మహారాజు పాండవపర్వతంవద్దకు కదిలివచ్చి, సిద్ధార్థుడితో, "అయ్యా, మీ పేరేమిటి? మీది ఏ దేశం?" అని అడిగాడు. సిద్ధార్థుడు చెప్పాడు. వెంటనే



వారిద్దరూ చిన్ననాటి స్నేహితులన్న సంగతి బయటపడింది. "సిద్ధార్థా, ఇదేం పని? మీ వంశంలో ఎవరైనా ఎన్నడైనా ఇలా బిచ్చమెత్తుకు తిన్నారా? ఎందుకిలా చేస్తున్నావు? మా రాజ్యంలో ఎనభైవేల గ్రామాలున్నాయి. అంగ మగధదేశాలు అయిదువేల చదరపుమైళ్ల విస్తీర్ణం. నాకు ఏటా అంతులేని కప్పం వస్తుంది. నా రాజ్యంలో సగం నీకు ఇచ్చేస్తాను, హాయిగా ఏలుకో!" అన్నాడు బింబిసారుడు.

"నాకు రాజ్యాలు అవసరంలేదు. నేను కోరేది బుద్ధత్వం!" అన్నాడు సిద్ధార్థుడు.

బింబిసారుడు ఎన్ని విధాలనో చెప్పి చూశాడు, కాని ఆయన మాటలు సిద్ధార్థుడి చెవి కెక్కలేదు. చివరకు బింబిసారుడు, "నువ్వు జ్ఞానం పొంది బుద్ధుడివయాక నీ జ్ఞానాన్ని మొట్టమొదటగా రాజగృహంలో ఉపదేశిస్తానని నాకు మాట ఇయ్యి!" అని, సిద్ధార్థుడిచేత ఒప్పించి, తిరిగివెళ్లాడు.

సిద్ధార్థుడు ఆ పర్వతంవద్దనుంచి బయలుదేరి వెళ్లేటప్పుడు అతనికి ఇద్దరు ధ్యాననిష్ఠాపరులు, అలారుడూ, ఉద్దకుడూ అనేవాళ్లు, తటస్థపడ్డారు. అతను వారితోపాటు ధ్యానం చేసి చూశాడు. కాని కేవల ధ్యానంచేత బుద్ధత్వం రాదని అతనికి తోచింది. కఠోరమైన తపస్సుచేత తప్ప తన కోరిక ఉడేరదనుకుని అతను ఉరువేల వనానికి వెళ్లాడు.

ఈ వనానికి దగ్గిరలో విస్తృతమైన ఇసక దిబ్బలున్నాయి. వీటి మూలంగానే ఆ అరణ్యానికి ఉరువేలవనమనే పేరువచ్చింది. ఆ అరణ్యంలో అనాదిగా వేలాది తాపసులుండేవారు. వారి మనసులోకి అల్పమైన ఆలోచనలు వచ్చి తపోభంగమైనప్పుడు ఆ తాపసులు నదిలో స్నానంచేసి, నదినుంచి గుప్పెడు ఇసక తెచ్చి, ఆ ఇసకను ఒక చోట వేసేవారు. ఇలా వేసిన ఇసక రెండామడల ఇసకమైదానంగా పరిణమించిందట.

—(ఇంకా వుంది)





# అహింసాజ్యోతి

## [4]

సిద్ధార్థుడు ఉరువేలవనంలో తపస్సుచేస్తున్న కాలంలో అయిదుగురు బ్రాహ్మణులు— కౌండిన్యుడు, భద్రాజీ, వప్రుడూ, మహానముడూ, అశ్వాజీ అనేవారు—అతను బుద్ధత్వం పొందటానికి తపస్సు చేస్తున్నట్టు తెలుసుకుని, అతని దగ్గిర చేరి శుశ్రూషలు చేస్తూ, "ఇతను తప్పక రేపటికి బుద్ధుడవుతాడు!" అని రోజూ గొంతెమ్మ కోరికలు కోరసాగారు. వారి శుశ్రూషలమూలంగా సిద్ధార్థుడికి సుఖంగా జరిగిపోసాగింది.

"తపస్సు చేసుకునేవాడికి సుఖాలు పనికిరావు. శరీరం తపించినప్పుడే తపస్సు సిద్ధిస్తుంది. తపస్సు ఎంత కఠోరంగా ఉంటే అంత త్వరగా సిద్ధిస్తుంది. మనిషికి ఆవగింజంత ఆహారమైనా చాలును!" అనుకుని సిద్ధార్థుడు ఉపవాసాలు చేస్తూ తపస్సు సాగించాడు.

ఈ ఉపవాసాలవల్ల బంగారు ఛాయ గల సిద్ధార్థుడి శరీరం కృశించి నల్లగా అయిపోయింది. అతని శరీరంపైన ఉండే ముప్ఫైరెండు శుభలక్షణాలూ కానరాకుండా పోయాయి. ఎంతో బలాఢ్యుడై ఉండికూడా ఇప్పుడు లేచి నిలబడలేని స్థితికి వచ్చాడు. అతని డొక్క వెన్నుకు అంటుకుపోయింది. ఒకనాటి రాత్రి మూడవ జామున అతను శోష వచ్చి, స్పృహతప్పి పడిపోయాడు.

"పాపం, మహారాజుల బిడ్డ! బుద్ధత్వం సాధిస్తానని తపస్సు ప్రారంభించి తపస్సు

ఫలించక ప్రాణాలు పోగొట్టుకున్నాడు!" అన్నారు వనంలో ఉండే ఇతర తాపసులు.

త్వరలోనే సిద్ధార్థుడు మరణించాడన్న వార్త కపిలవస్తునగరందాకా వెళ్ళింది. అయితే శుద్ధోదనమహారాజు నమ్మలేదు. తన కుమారుడు చక్రవర్తి కాలేదు, గనక బుద్ధుడు అయితీరుతాడని ఆయన నమ్మకం.

నిజానికి సిద్ధార్థుడు చావలేదు. అతను స్పృహ రాగానే భిక్షాపాత్ర తీసుకుని మళ్ళీ బయలుదేరాడు. మేరుపర్వతాన్ని పెకలించటం ఎంత అసాధ్యమో, ఉపవాసాలతో బుద్ధత్వం సంపాదించటం అంత అసాధ్యమని అతనికి తెలిసిపోయింది. అతను మళ్ళీ భోజనం చేయనారంభించగానే కృశించిన శరీరం మళ్ళీ కండపెట్టింది. అతని శుభ లక్షణాలన్నీ శరీరంలో యథాప్రకారం కనిపించాయి.

అయితే అతనికి శుశ్రూష చేసిన బ్రాహ్మణులు మటుకు, "ఈ తాపసి ఆరేళ్ళ కఠోర తపస్సు చేసికూడా బుద్ధత్వం సంపాదించలేకపోయాడు. మళ్ళీ కడుపునిండా తిననారంభించాడు!" అనుకుని, తమ కమండలాలూ, కౌపీనాలూ తీసుకుని వెళ్ళిపోయారు.

ఆ రోజుల్లో ఉరువేలవనం సమీపంలో సేనాని అనే ఒక ఉత్తమ క్షత్రియుడు ఒక గ్రామంలో ఉండేవాడు. ఆ గ్రామం పేరు



కూడా సేనానే. ఆయనకు సుజాత అని ఒక కుమార్తె ఉండేది. తనకు ఉత్తమ వంశానికి చెందిన భర్త లభించి, తొలి సంతానం మగబిడ్డ పుట్టినట్టయితే అజాపాల దేవుడికి ఏటా పరమాన్నం నైవేద్యం పెడతానని ఆమె మొక్కుకున్నది.

ఈ అజాపాలదేవుడు ఒక నుగవృక్షంలో ఉండేవాడని ప్రతీతి.

సుజాత కోరుకున్నట్టుగానే ఆమెకు కాశీలో ఉండే ఒక ఉత్తమ క్షత్రియుడు భర్తగా లభించాడు. త్వరలోనే ఆమె ఒక మగపిల్లవాణ్ణికూడా కన్నది. అందుచేత ఆమె వైశాఖపూర్ణిమనాడు చిక్కని ఆవు పాలతో పరమాన్నం వండి. దేవుడి చెట్టు దగ్గిర ఊడ్చి శుభ్రంచేసి రమ్మని తన బానిస అయిన పూర్ణ అనేదాన్ని పంపింది.

పూర్ణ చెట్టువద్దకు వచ్చేసరికి సిద్ధార్థుడు అదే చెట్టుకింద కూర్చుని ఉన్నాడు. అతని శరీరంలోనుంచి వెలువడే తేజస్సు చూసి పూర్ణ, ఆయనే దేవుడనుకుని, ఇంటికి పరిగెత్తిపోయి సుజాతతో, "అమ్మా, నీ నైవేద్యం తీసుకోవటానికి అజాపాలదేవుడు స్వయంగా వచ్చి చెట్టుకింద కూచున్నాడు!" అన్నది.

ఈ మాట విని సంతోషించి సుజాత, "ఇదే నిజమైతే నిన్ను నా కూతురుగా పెంచుకుని, మంచి మంచి నగలు పెడ





తానే!" అన్నది పూర్ణతో. తరవాత ఆమె మేలైన దుస్తులు ధరించి, తనకున్న విలువైన నగలన్నీ పెట్టుకుని, ఒక బంగారు పాత్రలో పరమాన్నం తీసుకుని, తన దాసిలందరూ వెంట రాగా, చెట్టువద్దకు వెళ్ళింది. సిద్ధార్థుణ్ణి చూడగానే ఆమె పరమానందం చెందింది. ఆమె పరమాన్నం అతనిముందు పెట్టి, "నా కోరిక సిద్ధించింది; అలాగే మీ కోరిక కూడా సిద్ధించుగాక!" అన్నది.

సిద్ధార్థుడు పరమాన్నం ఆరగించినాక ఆయన చేతులు కడుక్కోవటానికి సుగంధ జలం ఇచ్చి సుజాత తన ఇంటికి తిరిగి పోయింది. సిద్ధార్థుడుకూడా అక్కడినుంచి కపిలి నిరంజర అనే నది వద్దకు వెళ్లాడు; సుప్రతిష్ఠితమనే చోట స్నానంచేశాడు. తరవాత అతను ఆ నది ఒడ్డునే ఉన్న ఒక అరణ్యం ప్రవేశించి పగలల్లా ఒక సాల వృక్షంకింద కూచున్నాడు.

చీకటి పడగానే సిద్ధార్థుడు సాలవృక్షం కిందనుంచి లేచి ఒక రావిచెట్టుకేసి నడవ సాగాడు. దారిలో అతనికి ఒక బ్రాహ్మడు ఎదురుపడి ఎనిమిది దర్భకట్ల ఇచ్చాడు. సిద్ధార్థుడు రావిచెట్టు నాలుగువైపులా చూసి తూర్పువైపునే సమప్రదేశం ఉండటం గమనించాడు. అక్కడ అతను దర్భలు ఆసనంగా పరుచుకుని వాటిపైన కూచున్నాడు.

సిద్ధార్థుడు బుద్ధత్వం సాధించే ఘడియలు దగ్గిరపడుతూఉండటం గుర్తించి మన్మథుడు అతని మనస్సును చలింపజేయ నిశ్చయించాడు. గడిచిన ఆరేళ్లూ మన్మథుడు ఈ పనిమీదనే ఉన్నాడు. కాని అతని ప్రయత్నాలు ఫలించలేదు; అందుచేత ఈసారి విశ్వప్రయత్నం చేద్దామనుకున్నాడు. ఆయన తన పరివారాన్ని వెంటబెట్టుకుని, అనేకవంచల ఆయుధాలు తీసుకుని యుద్ధానికి వెళ్లేవారిలాగా బయలుదేరాడు. మన్మథుడి అనుచరులందరూ భయంకరమైన వన్యమృగాల రూపాలు ధరించారు.

సిద్ధార్థుడు ఆ సైన్యాన్ని చూసి, "నన్ను ఒక్కణ్ణి ఓడించటానికి ఇంత పెద్ద సైన్యం వస్తున్నది. ఇప్పుడు నన్ను రక్షించే తండ్రీ, అన్నలూ, మిత్రులూ, బంధువులూ ఎవరూ లేరు. నేను ఇంతకాలంగా విడవకుండా ఆచరించిన ధర్మాలు మాత్రమే నాకు రక్ష!" అనుకున్నాడు.

మన్మథుడు సిద్ధార్థుడి వెనకనుంచి బోధి వృక్షాన్ని సమీపించబోయాడు కాని అది సాధ్యం కాలేదు. ఆయన ఒక ప్రచండ మారుతాన్ని సృష్టించాడు. ఆ గాలికి ఎంతెంత చెట్లూ విరిగి పడిపోయాయి; కొండ రాళ్లసయితం కొట్టుకుపోయాయి, కాని రావి చెట్టు ఆకు ఒక్కటికూడా కదలలేదు; సిద్ధార్థుడి ఉత్తరీయం అంచుకూడా ఆ గాలికి ఆడలేదు. ఆ గాలి సిద్ధార్థుడికి మలయమారుతంలాగా మాత్రమే సోకింది.

ఇది చూసి మన్మథుడు మండిపడి అనేక వేల కాలమేఘాలను రప్పించాడు. అవి భీకరంగా ఉరిమి, ఏనుగుతొండాలంత ధారలతో వర్షం కురవసాగాయి. ఆ వానకు చెట్లన్నీ కొట్టుకుపోయాయి, భూమి చిల్లులు పడింది; కాని సిద్ధార్థుడిపైన ఒక్క చుక్క కూడా పడలేదు.

మన్మథుడికి రోషం రెచ్చిపోయింది. ఆయన ఆకాశంనుంచి సిద్ధార్థుడిపైన మండే





కొండలను కురిపించాడు, అనేకవర్షం కురిపించాడు. ఇంకా అనేకవిధాల సిద్ధార్థుణ్ణి నాశనం చెయ్యాలని చూశాడు. అన్ని ప్రయత్నాలూ విఫలమయాయి. చివరకు ఆయన గిరిమేఖలమనే తన ఏనుగుపై ఎక్కి తన చక్రాన్నికూడా సిద్ధార్థుడిపై విసిరాడు. అదికూడా వ్యర్థమైపోయింది.

మన్మథుడు ఓడిపోయి పారిపోయాడు. తన తండ్రి పరాభవం చూసి మన్మథుడి కుమార్తెలు ముగ్గురూ చాలా ఆకర్షవంతమైన దుస్తులు ధరించి వచ్చి, సిద్ధార్థుణ్ణి తమ వలలో వేసుకునేటందుకు, "అహా, ఇంత అందగాడివి ఎందుకు అరణ్యంలో తపస్సు చేస్తున్నావు? నీకు భార్యలేదా? ఆమెతో పోట్లాడివచ్చావా? ఎవరైనా నీ ప్రేమను నిరాకరించారా?" అని రకరకాల ప్రశ్నలు వేశారు. కాని సిద్ధార్థుడు వారికేసి చూడనైనా చూడలేదు. అందుచేత వారు కూడా నిష్క్రమించారు.

మన్మథుణ్ణి జయించగానే సిద్ధార్థుడికి బుద్ధత్వం వచ్చింది. శతకోటి బ్రహ్మాండాలలో అన్నికాలాలయందూ నడిచిన వృత్తాంతాలన్నీ అతని కళ్ళకు కట్టినట్టయింది; జీవికి జన్మపరంపర ఎందుకు కలుగుతుందో అర్థమయింది. మర్నాడు తెల్లవారేలోపుగా అతనిలో మిగిలిఉన్న కోరికలన్నీ పూర్తిగా

నిర్మలమైపోయాయి. అతను బుద్ధుడయాడు; అతని శరీరంలోనుంచి ఆరు రకాల రంగుల కిరణాలు వెలువడ్డాయి.

సిద్ధార్థుడు పుట్టినప్పుడు కలిగిన అద్భుతాలన్నీ తిరిగి ఇప్పుడు కలిగాయి.

బుద్ధుడు మరి వారంరోజులపాటు రావి చెట్టుకిందనే కూచున్నాడు. రావిచెట్టుకింద సిద్ధార్థుడు బుద్ధత్వం సంపాదించటంచేత దానికి బోధివృక్షమన్న పేరు వచ్చింది.

తరవాత బుద్ధుడు గాలిలోకి లేచి, అక్కడ ఒక్క క్షణం ఆగివుండి, బోధి చెట్టుకు ఈశాన్యదిశగా నేలపై వాలాడు. తరవాత ఆయన అక్కడినుంచి కన్ను ఆర్పకుండా బోధివృక్షాన్ని వారంరోజుల పాటు చూస్తూ ఆరాధించాడు. ఆ ప్రదేశాన్ని అనిమిషలోచన చైత్యం అంటారు.

తరవాత బుద్ధుడు తాను వాలిన చోటు నుంచి లేచి బోధివృక్షం వద్దకూ, మళ్ళీ వెనక్కూ, వారంరోజులపాటు పచారు చేశాడు. అతను పచార్లుచేసిన ప్రదేశాన్ని చంక్రమణ చైత్యం అంటారు.

తరవాత బుద్ధుడు బోధివృక్షానికి వాయువ్యదిశగా కూచుని వారంరోజుల పాటు ధర్మాన్నిగురించి ఆలోచించాడు. ఆయన ఇలా కూచున్న చోటును రతనఘర చైత్యం అంటారు. బుద్ధుడు అయిదవ వారమంతా అజాపాలవృక్షం కింద నిర్వాణాన్ని అనుభవించుతూ గడిపాడు; ఆరవ వారమంతా ముచలింద సరస్సు సమీపంలో ఒక చెట్టుకింద ఉండిపోయాడు. ఆ వారం రోజులూ జోరున వర్షం కురిస్తే సరస్సులో నుంచి నాగరాజు వచ్చి బుద్ధుడిపై వర్షం పడకుండా తన పడగ విప్పి గొడుగులాగా పట్టాడట! ఈ వారంరోజులూ బుద్ధుడు ధ్యానంలో గడిపాడు. ఏడవ వారమంతా కిరిపాలు అరణ్యంలో రాతిపై పడుకున్నాడు. ఈ ఏడు వారాలపాటూ ఆయన ఏ ఆహారమూ తీసుకోలేదు. —(ఇంకా వుంది)





# అహింసాజ్యోతి

## [5]

తపస్సుడు, భల్లుకుడు అనే ఇద్దరు అన్న దమ్ములు వర్తకంకోసం ప్రయాణం చేస్తూ అయిదువందల బళ్లపై సరుకు వేసుకుని ఉరువేలవనంకేసి వచ్చారు. ఒక చోటికి వచ్చేవరికి బళ్ల చక్రాలు ఇరుసులదాకా భూమిలో దిగబడిపోయాయి, ఎద్దులు మోకాటి తండాలు వెయ్యవలసివచ్చింది.

ఇదేదో దైవమాయ అనుకుని ఆ సోదరులు ధూపదీపాలతో దేవతలను ఆరాధించారు. ఈ సమయంలో వారికి ఆ వనంలో బుద్ధుడు కనిపించాడు. వారాయనకు తేనె ఆహారంగా ఇచ్చారు. బుద్ధత్వం పొందినాక నలభైతొమ్మిది రోజులు ఉపవాసం ఉండి ఆయన పుచ్చుకున్న ఆహారం ఇదే.

బుద్ధుడు ఆ సోదరులకు మూడు విషయాలు బోధించి వారిని ఉపాసకులుగా చేశాడు. ఈలోపుగా వారిబళ్లు భూమినుంచి బయటపడ్డాయి. వారు ప్రయాణం సాగిస్తూ, "స్వామీ, తమ జ్ఞాపకార్థం మాకు ఏమైనా ఇవ్వండి!" అని అడిగారు. బుద్ధుడు తన కుడిచెయ్యి ఎత్తి తన తలమీది కేశాలు తీసి ఇచ్చారు. వారు వాటిని ఒక పేటికలో పెట్టి తమవెంట తీసుకుపోయారు.

ఆ సోదరులు కాలక్రమాన సముద్ర తీరం చేరి తమ సరుకులను ఒక నావలోకి ఎక్కించుకుని సముద్రయానం సాగించారు. కొంతకాలానికి వారు సింహళం చేరుకున్నారు. అక్కడ వారికి పంటచెరుకూ,



మంచినీరూ కావలసిరావటంవల్ల వారు నావను ఒక రేవుకు చేర్చి, ఒడ్డుకు వెళ్ళి వంటపని ప్రారంభించారు. ఆ సమయంలో బుద్ధుడి కేశాలు గల పేటికను వారొక రాతి పైన ఉంచారు.

వారు తమ భోజనాలు ముగించుకుని తిరిగి ప్రయాణం సాగించేటప్పుడు పేటికను తీయబోతే, అది రాతికి అంటుకుపోయి ఊడి రాలేదు. అందుచేత వారా పేటిక చుట్టూ పూలూ, దీపాలూ అమర్చి నావలో తమదారిన తాము వెళ్ళిపోయారు. మరి కొంతకాలానికి ఆ పేటిక ఉండిన చోట గిరిహందువిహారం నిర్మించబడింది.



బుద్ధుడు తాను ప్రచారం చెయ్యవలసిన ధర్మాన్నిగురించి చాలా దీర్ఘంగా యోచించాడు. మనుషులు పాపపంకిలంలో పొర్లుతున్నారు. వారికి సత్యం అణుమాత్రమైనా తెలియదు. వారు తన మాటలను విని, నిజం తెలుసుకుని, సరిగా జీవించేది ఎలా? ఈ విషయమై బుద్ధుడు ఆలోచించాడు.

ఆయన తాను బుద్ధత్వం పొందిన అరవై రోజులకు కాలినడకను ఒంటరిగా ఋషిపతనం అనే చోటికి బయలుదేరారు. అది 288 మైళ్ళ దూరాన వారణాసికి సమీపంలో ఉన్నది. దారిలో ఉపకుడు అనే యాచకుడు తగిలాడు. బుద్ధుడి రూపమూ, వర్చస్సూ చూసి ఉపకుడు నిర్ఘాంతపోయి, "స్వామీ, నీవు బ్రహ్మవా, ఇంద్రుడివా?" అని అడిగాడు.

"నేను బ్రహ్మనూ కాను, ఇంద్రుణ్ణి కాను. జన్మపరంపర ఎందుచేత కలుగుతుందో, దానినుంచి విముక్తి పొందటమెలాగో తెలుసుకుని, విసర్జించవలసినదంతా విసర్జించి, సేకరించవలసినదంతా సేకరించిన బుద్ధుణ్ణి, నా పేరు అనంతజినయుడు," అన్నాడు బుద్ధుడు.

కొంత దూరంపాటు బుద్ధుడివెంట నడిచి ఉపకుడు వంగదేశం వెళ్ళిపోయాడు. అక్కడ





అతను ఒక స్త్రీని పెళ్ళాడి, సంసారలంపటంలో కొంతకాలం పడరాని పాట్లు పడి, తరవాత బుద్ధుణ్ణి వెతుక్కుంటూ ఇసిపతనం వెళ్ళి అక్కడ బౌద్ధుడయిపోయి తరించారు.

ఉపకుణ్ణి కలుసుకున్న రోజు సాయంకాలమే బుద్ధుడు ఇసిపతనవిహారం చేరుకున్నాడు. ఉరువేలవనంలో ఆయనకు కొంతకాలంపాటు శిష్యులుగా ఉండి, ఆయనయందు విశ్వాసం పోగొట్టుకుని, వెళ్ళిపోయిన కౌండిన్యుడు మొదలైన తాపసులు ఈ విహారంలోనే ఉంటున్నారు.



అంతదూరాన ఉండగానే వారు బుద్ధుణ్ణి చూసి, "అతనుకూడా ఇక్కడికే వస్తున్నారు. అతని శరీరం చూడండి, మిసమిసలాడుతూ, బంగారంలాగా వెలిగిపోతూ ఎలా ఉన్నదో. పుష్కలంగా భోజనంచేస్తున్నట్టున్నారు. బుద్ధత్వంకోసం ప్రయత్నించటం మానుకున్నారు కాబోలు. అతను వస్తే మన తోబాటు కూచోనిద్దాం, కాని మనం లేవ వలిసిన పనిలేదు," అనుకున్నారు.

అయినప్పటికీ బుద్ధుడు తమవద్దకు వచ్చేసరికి వారు తమ తీర్మానాన్ని మరిచిపోయి లేచి నిలబడ్డారు, ఆయనకు అర్ఘ్య పాద్యాలిచ్చి కుశలప్రశ్నలు చేశారు.

ఆ సాయంకాలమే బుద్ధుడు ఆ విహారంలో తన తొలిబోధ చేశాడు. ఆచార్యులు కాదలిచినవాళ్లు పాపపూరితమైన కోరికలను విసర్జించాలనీ, బ్రాహ్మణ తాపసుల లాగా కఠోరమైన వ్రతాలుకూడా మానాలనీ ఆయన హెచ్చరించాడు. ఆయన మగధ దేశపు భాషలో అందరికీ అర్థమయేలాగ సంభాషించాడు.

ఈ ఉద్బోధ ఫలితంగా అయిదుగురు బ్రాహ్మణులలో పెద్దవాడైన కౌండిన్యుడు బుద్ధుడి శిష్యుడయాడు.

బుద్ధుడు ఇసిపతనంలో ఉండగా ఆయన వద్దకు అనేకమంది వచ్చి శిష్యులయారు.





ఇలా వచ్చినవారిలో సుజాత కొడుకు యశుడనేవాడు ఒకడు. యశుడు ఒకరాత్రి రహస్యంగా బుద్ధుడి వద్దకు వచ్చాడు. బుద్ధుడు ఎంతో ప్రేమతో అతనిని చేరదీసి తన శిష్యుడుగా చేసుకున్నాడు. తన కొడుకు ఇలా చేశాడని సుజాత భర్త చాలా కిన్నుడయాడు. బుద్ధుడు అయనకుకూడా తత్వోపదేశం చేసి తన అనుచరులలో చేర్చుకున్నాడు. యశుడితో ఆడుకునే యాభైనలుగురు పిల్లలు యశుడి మనసు మార్చటానికిగాను ఆరామానికి వచ్చారు. బుద్ధుడు వారితో కూడా మాట్లాడి వారిని తన అనుచరులలో చేర్చుకున్నాడు.



అప్పుడు బుద్ధుడి శిష్యులలో అర్హతుల శ్రేణికి చెందినవారు అరవైమంది ఉన్నారు. వారితో బుద్ధుడు, "మీరంతా వేరువేరు మార్గాల అన్ని దిక్కులకూ వెళ్ళి బుద్ధుడు అవతరించాడని ప్రజలకు చాటండి!" అన్నాడు. అర్హతులు ప్రయాణమై వెళ్ళాక బుద్ధుడు ఉరువేలవనానికి బయలుదేరాడు. మధ్యదారిలో నాలుగు దారులు కలిసేచోట ఒక చెట్టునీడను విశ్రమించాడు. ఆ సమయంలో అక్కడికి ముప్ఫైరెండుమంది క్షత్రియకుమారులు వచ్చారు.

వీరు భద్రవర్గులనబడే ఉత్తమ జాతి క్షత్రియులు, కోసలదేశానికి చెందినవారు. కోసలరాజా వీరికొక పరగణా ఇచ్చి దానిని సమిష్టిగా పరిపాలించమని చెప్పాడు. ఒకనాడు వారందరూ తమతమ స్త్రీలను వెంటబెట్టుకుని శప్రశిక అనే ఒక రమణీయ ప్రదేశం చూడటానికి వచ్చారు. ఆ ముప్ఫైఇద్దరిలోనూ ఒకడివెంట ఉండిన స్త్రీ అతని భార్యకాదు, ఉంపుడుగత్తె. ఆమె అతని ఆభరణాలన్నీ దొంగిలించి పారిపోయింది. ఆమెను వెతుకుతూ రాజకుమారులందరూ బుద్ధుడు విశ్రమించిన చోటికి వచ్చారు.

బుద్ధుడు వారి కథ అంతా విని, "మీరు ఇతరులకోసం అన్వేషించటం మంచిదా,





మిమ్మల్ని మీరే అన్వేషించుకోవటం మంచిదా?" అని అడిగాడు.

ఆయన ఉద్దేశం అర్థమై క్షత్రియులు, ఎవరిని వారు అన్వేషించుకోవటమే మంచి దని ఒప్పుకున్నారు.

బుద్ధుడు వారి మాటలకు సంతోషించి వారికి తత్వం ఉపదేశించి, అర్హతులనుచేసి, వారినికూడా దేశాలమీద పంపాడు. వీరితో ప్రచారకుల సంఖ్య 92 కు పెరిగింది.

బుద్ధుడు ఉరువేలవనానికి తిరిగి వచ్చాక ఆయనకు ఒక విషయం తెలిసింది. ఆ సమీపంలో ఒక నది ఒడ్డున ఉరువేల కాశ్యపుడూ, గయా కాశ్యపుడూ, నది కాశ్యపుడూ అనే ముగ్గురు అన్నదమ్ములు మహావైభవంగా జీవిస్తూ, సౌఖ్యాలలో ఓలలాడుతూకూడా తాము అర్హతులమని చెప్పుకుని ప్రజలను వంచిస్తున్నారు. పెద్దవాడికి 500 మంది శిష్యులూ, రెండోవాడికి 300 మంది శిష్యులూ, మూడోవాడికి 200 మంది శిష్యులూ ఉన్నారు. ఈ వెయ్యిమందికీ ప్రబోధం ఇచ్చి సన్మార్గంలో పెట్టాలని బుద్ధుడు నిశ్చయించాడు.

ఆయన ఒక సాయంకాలం ఉరువేల కాశ్యపుడి ఇంటికి వెళ్ళి, ఆ రాత్రికి తనను అగ్నిగృహంలో ఉండనివ్వమని కోరాడు.

"నాకేమీ అభ్యంతరం లేదు. కాని అగ్ని గృహంలో ఒక విషసర్పం ఉన్నది. మేము అర్హతులము గనక మా అన్నదమ్ములనూ, మా శిష్యులనూ అది ఏమీచేయలేదు. కాని నీవంటి అర్హతుడు కానివాడు దాని విషానికి మాడిపోతాడు," అన్నాడు ఉరువేలుడు.

బుద్ధుడు ఈ మాటలు వినపడనట్టు, "నన్ను దయచేసి అగ్నిగృహంలో పడుకో నివ్వండి!" అన్నాడు.

"విషసర్పం ఉందని చెప్పాను. కావలిస్తే పడుకో!" అన్నాడు ఉరువేలుడు.

ఆ రాత్రి బుద్ధుడు పడుకున్నచోటికి విష సర్పం రానేవచ్చింది. బుద్ధుడు దాన్ని అవ



లీలగా లోబరుచుకుని, దాని విషం పిండేసి, దాన్ని తన భిక్షాపాత్రలో పెట్టుకున్నారు.

మర్నాడు కాశ్యపసోదరులు బుద్ధుడి భిక్షాపాత్రలో చుట్టచుట్టుకుని పడుకుని ఉన్న పామును చూసి నిర్ఘాంతపోయారు. వారు బుద్ధుడితో, "నిప్పు విషసర్పాన్ని లోబరుచుకున్నంతమాత్రాన అర్హతుడివై పోలేవులే!" అన్నారు.

తరవాత బుద్ధుడు ముగ్గురు కాశ్యపులనూ, వారి వెయ్యిమంది శిష్యులనూ ప్రబోధించారు. వారందరూ ఆయన శిష్యులై అర్హతుల శ్రేణిలో చేరిపోయారు.



తనకు బుద్ధత్వం లభించినట్టయితే రాజగృహానికి వచ్చి ప్రజలకు ఉపదేశం చేస్తానని సిద్ధార్థుడు బింబిసారుడికి మాట ఇచ్చి ఉన్నారు. అందుచేత ఇప్పుడు బుద్ధుడు బయలుదేరి వెళ్ళి రాజగృహానికి పన్నెండు మైళ్ళదూరాన ఉన్న యష్టివనంలో ఒక చెట్టుకింద కూచున్నారు. బుద్ధుడి వెంట ఉరువేల కాశ్యపుడుకూడా ఉన్నారు.

బుద్ధుడు యష్టివనంలో విశ్రమించిన వార్త ఆటవికులద్వారా బింబిసార మహారాజుకు తెలియవచ్చింది. ఆయన ఒక లక్ష ఇరవైవేలమంది అనుచరులతో బయలుదేరి బుద్ధుడున్న చోటికి వచ్చారు.

బింబిసారుడి అనుచరులు ఉరువేల కాశ్యపుడు గొప్ప సిద్ధుడని ఎరుగుదురు. వారిప్పుడాయనను బుద్ధుడి వెంట చూసి, వారిద్దరిలో ఎవరు గురువో, ఎవరు శిష్యుడో ఊహించలేకపోయారు. వారి సందేహానికి సమాధానంగా ఉరువేలుడు, "అయ్యలారా, బుద్ధుడు సూర్యుడు. ఆయనముందు నేనొక మిణుగురు పురుగును!" అన్నారు.

ఆ సమయంలో బుద్ధుడు అక్కడ చేరిన వారికి మొట్టమొదట జాతక కథ చెప్పారు. దాని సారాంశమేమంటే:

ఉరువేలుడు ఒక పూర్వజన్మలో అంగాతి అనే మిథిలానగరపు రాజు



ఆయనకు రుజా అని ఒక కుమార్తె ఉండేది. అంగాతి క్షుద్ర సిద్ధాంతాలు తలకు పట్టటం చేత, మరణానంతరం జీవికి వేరే లోకాలు లేవనీ, ప్రాణి చనిపోగానే శరీరం పంచ భూతాలలో లీనమైపోతుందనీ, అందుచేత అనుభవించేదంతా ఈ జన్మలోనే అనుభవించాలనీ భావించాడు. ఆయన కుమార్తె రుజా పుణ్యకార్యాలకు ద్రవ్యం అడిగితే ఇవ్వ నిరాకరించాడు. అప్పుడు మహా బ్రహ్మగా ఉంటున్న బోధిసత్వుడు ఆయన వద్దకు వచ్చి, "నీకుమార్తె పుణ్యకార్యాలకు డబ్బు ఇవ్వరాదా?" అన్నాడు.

"నా కుమార్తెకు కావలిసిన ద్రవ్యం అప్పుడు మీరివ్వండి. నేను చనిపోయాక ఆ బాకీ పదింతలుగా తిరిగి ఇస్తాను. నేను ఇంత రాజ్యానికి రాజునుకదా. మీ సొమ్ము ఎక్కడికి పోదు" అన్నాడు అంగాతి.

దానికి బోధిసత్వుడు, "ఓయి, వెర్రి వాడా! నీవు ఇప్పుడు రాజువేగాని చనిపోయినాక నీకు గోచిపాతకూడా ఉండదు. తినటానికి తిండికూడా ఉండదు. నువ్వు నరకంలో ఉండి పడరాని పాట్లన్నీ పడతావు. అటువంటి స్థితిలో నా బాకీ ఎలా తీర్చగలుగుతావు. అందుచేత నేను నీకు అప్పుపెట్టను." అన్నాడు.

ఈ మాటలతో అంగాతి హడలిపోయి తన మనసును మార్చుకుని పుణ్యం సంపాదించుకున్నాడు.

ఈ జాతక కథ చెప్పినాక బుద్ధుడు తన ఉపదేశం వినటానికి వచ్చినవారందరినీ, బింబిసార మహారాజునూ తన శిష్యులుగా చేర్చుకున్నాడు. బింబిసారుడు రాజ్యాభిషేకం చేసుకునేనాటికి పదహారేళ్లవాడు. బుద్ధుని శిష్యుడయేనాటికి ఆయన వయసు ఇరవైతొమ్మిది ఏళ్లు. అది మొదలుకొని ముప్పై ఆరేళ్లపాటు ఆయన జీవితం బుద్ధునికి తోడ్పడటంలో గడిచింది.

(ఇంకా వుంది)





# అహింసాజ్యోతి

**[ 6 ]**

శ్రమ రాజైన బింబిసారుడు బుద్ధుడి బోధలు విని ఆయన శిష్యుడైనాడని వినగానే రాజగృహంలోని ప్రజలు, "ఎవరీ బుద్ధుడు? ఈయన ఏమి బోధ చేస్తాడు? నిర్వాణమంటే ఏమిటి?" అని వింతగా ప్రశ్నించసాగారు. వారి ప్రశ్నలకు సరిఅయిన సమాధానాలు చెప్పేవారు లేనందున వారు పన్నెండు మైళ్లూ నడిచి బుద్ధుడున్న విహారానికి బయలుదేరారు. రోజూ వచ్చే పోయే జనంతో దారి కిటకిటలాడిపోయింది.

ప్రస్తుతం బుద్ధుడి విహారం ఉంటున్న యష్టివనం మరీ దూరమైపోయిందనీ, తాను రోజూ బుద్ధుణ్ణి చూసి, ఆయన సన్నిధిలో కొంతకాలం గడిపితేగాని తన మనసుకు తగినంత శాంతి ఉండదనీ బింబిసారమహారాజు భావించారు. ఆయన తన ఉద్యానవనమైన వేలువనాన్ని బౌద్ధవిహారంగా మార్చ నిశ్చయించారు. ఈ వనం చుట్టూ వెదురుపొద లుండేవట, అందుచేత ఈ వనానికి వెలువనమనే పేరు వచ్చింది.

బింబిసారుడు వేలువనాన్ని బుద్ధుడికి శాస్త్రోక్తంగా, చేతిలో నీరుపోసి ధారపోశారు. ఇది బుద్ధుడుండిన నివాసాలన్నిటిలోకి అత్యంత ప్రసిద్ధమయింది.

రాజగృహానికి కొద్దిదూరంలోనే కొలితమూ, ఉపతిశ్యమూ అని రెండు బ్రాహ్మణ గ్రామాలుండేవి. వాటిని కొలితుడూ, ఉపతిశ్యుడూ అనే క్షత్రియులు పాలించేవారు.





వారి కుటుంబాల మధ్య ఏడు తరాలుగా స్నేహ సంబంధాలుంటున్నాయి. కోలితుడికి అయిదు వందల రథాలుండేవి, ఉపతిష్యుడికి అయిదు వందల బంగారు మేనాలుండేవి. వారిలో ఒకరు ఏం చేస్తే రెండో వారు అదే చేసేవారు, ఒకేరకం వినోదాలలో కాలం గడిపేవారు. అయితే వారిద్దరికీకూడా జన్మపరంపరలమీద విముఖత్వం కలిగింది. సుఖాలలో కాలం గడపటంచేత నిర్వాణం, లేక జన్మవిముక్తి, కలగదని వారు నిశ్చయించుకున్నారు.

ఆ కాలంలో రాజగృహంలో సంగుడనే ప్రసిద్ధ పరివ్రాజకుడుండేవాడు. కోలితుడూ, ఉపతిష్యుడూ కొంతకాలం ఈ సంగుడి వద్ద చేరి ఆయనకు శుశ్రూష చేశారు, కాని సంగుడు వారికి మోక్షమార్గం చూపలేక పోయాడు. ఆ తరవాత వారు అనేక దేశాలు సంచారంచేసి కనిపించినవారినల్లా అనేక ప్రశ్నలు వేశారు. ఒక్కరుకూడా వారి అనుమానాలు తీర్చలేకపోగా, వారు రాజగృహానికి తిరిగి వచ్చారు.

ఈ సమయంలో బుద్ధుడు వేలువనంలో ఉంటున్నారు. ఈలోపల అశ్వజిత్ అనే బుద్ధశిష్యుడు దేశసంచారం చేసి బుద్ధుడు అవతరించాడని దేశదేశాలా ప్రచారంచేసి, రాజగృహానికి తిరిగివచ్చాడు. వచ్చిన మర్నాడే అశ్వజిత్ భిక్షాపాత్ర తీసుకుని భిక్ష కోసం ఇల్లిల్లా తిరగసాగాడు. అలా తిరుగుతూ ఆయన ఉపతిష్యుడికి కనిపించాడు.

ఉపతిష్యుడు అశ్వజిత్ని చూసి సంతోషించి తన ఇంటికి భిక్షకు రమ్మని ఆహ్వానించాడు. అశ్వజిత్తో కొంతసేపు సంభాషించి నాక ఉపతిష్యుడు, "అయ్యా, తమ సంభాషణ వింటుంటే తమకు మోక్షమార్గం అర్థమైనట్టున్నది. తమకు ఉపదేశం చేసిన గురువెవరు?" అని అడిగాడు.

"నా గురువు గౌతమబుద్ధుడు," అని అశ్వజిత్ సమాధానం చెప్పాడు.





"ఆయన చెప్పే సిద్ధాంతా లేమిటి?" అని ఉపతిష్యుడు అడిగాడు.

ఈ ఉపతిష్యుడు బుద్ధవ్యతిరేకి అన్న అనుమానం కలిగి అశ్వజీ, "నాయనా, నేను కొత్తగా శిష్యత్వం పొందినవాణ్ణి. ధర్మం అపారమైనది. దాన్ని నేను నీకు ఎలా వివరించగలను?" అన్నాడు.

"ఫరవాలేదు. నేను సత్యాన్ని అన్వేషించేవాణ్ణి. నాకు కొంచెం అందించారంటే అల్లుకుపోగలను. మీరు ఒక్క సత్యం చెబితే, దానినుంచి వందలా, వేలా సత్యాలు ఊహించగలను," అన్నాడు ఉపతిష్యుడు.



అప్పుడు అశ్వజీ ఈ శ్లోకం చదివాడు:

"యే ధమ్మ హేతుప్పభవా,
యేసన్ హేతున్ తథాగతో,
ఆహ యేసన్ చ యో నిరోధో,
ఏవన్ వాదీ మహా సమణో."

[ప్రతిదీ ఒక కారణాంతరంవల్లనే ఏర్పడుతుంది. ఈ కారణాన్ని తత్వజ్ఞులు ప్రకటించారు. వీటన్నిటినీ (జన్మపరంపరను) నిరోధించవచ్చును. ఇదే మహాశ్రమణుడు (బుద్ధుడు) చెప్పిన సంగతి.]

ఈ మాటలు వినగానే ఉపతిష్యుడు పరమానందభరితుడై అశ్వజీని ఆలింగనం చేసుకుని, "మీ మాటలు నాకు తృప్తి కలిగించాయి. బుద్ధుడియందు నాకు విశ్వాసం కుదిరింది. ఆయన ఎక్కడ?" అని అడిగాడు.

అశ్వజీద్వారా బుద్ధుడుండే చోటు తెలుసుకున్నాక ఉపతిష్యుడు తన మిత్రుడైన కోలితుడి వద్దకు వెళ్ళి, "మిత్రమా, నాకు నిర్వాణమార్గం దొరికింది," అంటూ అశ్వజీ చదివిన శ్లోకాన్ని చదివాడు.

కోలితుడికికూడా బుద్ధుడు జన్మరాహిత్యం ఉపదేశించగలడని నమ్మకం కలిగింది. ఇద్దరూ కలిసి తమ మొదటి గురువైన సంగుడి వద్దకు వెళ్లారు. సంగుడు వారు చెప్పినదంతా విని, తల అడ్డంగా







తిప్పి, "నేను బుద్ధుడి వద్దకు రావటం సాధ్యంకాదు. నా కీర్తి జంబూద్వీపమంతా వ్యాపించింది. అటువంటివాణ్ణి మరొకడికి శిష్యుణ్ణి అవుతానా?" అన్నాడు.

సంగుడివద్ద ఉంటున్న శిష్యులు అయిదు వందలమందీ మటుకు బుద్ధుణ్ణి దర్శించ టానికి బయలుదేరారు. అది చూసి సంగుడు కళ్ల నీళ్లపర్యంతం వచ్చాడు. అందుచేత ఆయన శిష్యులలో సగంమంది ఆయన వెంట ఉండిపోయారు. మిగిలినవాళ్లు కోలిత ఉపతిష్యులవెంట బుద్ధుణ్ణి చూడబోయారు.

వారు విహారాన్ని చేరే సమయానికి బుద్ధుడు తనచుట్టూ చేరినవారికి ఉపదేశం చేస్తున్నాడు. కోలితుణ్ణీ, ఉపతిష్యుణ్ణీ దూరానే చూసి ఆయన, "నా ప్రధాన శిష్యులిద్దరూ వస్తున్నారు!" అన్నాడు.

వారిద్దరూ బుద్ధుడికి వందనప్రణామాలు చేసి తమకు తత్వం ఉపదేశించమని ప్రార్థిం చారు. బుద్ధుడు వారితో, "నన్ను ఆశ్ర యించండి. కష్టాలనుండి విముక్తి పొంద టానికిగాను బ్రహ్మచర్యదీక్ష పూనండి. మీకు చక్కని మోక్షమార్గం ఉపదేశిస్తాను!" అన్నాడు.

తరవాత ఉపతిష్యుడూ, కోలితుడూ, సంగుడి శిష్యులు రెండువందల యాభై మందీ బౌద్ధులైపోయారు. కోలితుడు తన పేరు మార్చుకుని ముగలానుడు అయాడు, ఉపతిష్యుడు సారిపుత్రుడయాడు. వీరిద్దరూ బుద్ధుడి ప్రధాన శిష్యులయారు.

ఇది జరిగిన కొద్దిరోజుల అనంతరం ఒక పౌర్ణమినాటి రాత్రి రాజగృహంలో ఒక ప్రముఖ సమావేశం జరిగింది. ఈ సమా వేశంలో విశేషమేమిటంటే ఆ సమావేశానికి వచ్చినవారంతా ఆహ్వానాలు లేకుండానే వచ్చారు. అందులో పాల్గొన్నవారంతా అర్హతుల శ్రేణికి చెందినవారే. ఆ సమా వేశంలో బుద్ధుడు తన శిష్యులను ఈ విధంగా అనుశాసించాడు.





"సబ్బ పాపస్స అకరణమ్ :
కుశలస్య ఉపసంపదా :
స చిత్త పరియో దపనమ్ :
ఏతన్ బుద్ధానుశాసనమ్."

[ఎట్టి పాపాలూ చేయవద్దు; ప్రతి సద్గుణాన్నీ సాధించాలి, మనస్సు స్వాధీనంలో ఉంచుకోవాలి, ఇదే బుద్ధుని శాసనం.]

బుద్ధుడు వేలువనంలో ఉంటుండగానే కపిలవస్తు నగరంలో ఉన్న శుద్ధోదన మహారాజుకు తన కుమారుడు బుద్ధుడయాడని వార్త తెలిసింది. ఆయన ఒక క్షత్రియ పుంగవుడి వెంట వెయ్యిమంది పరివారాన్ని ఇచ్చి తన కుమారుడికి ఈ విధంగా సందేశం పంపాడు,

"నాకు నిన్ను చూడాలని ఉన్నది, కనుక నీవు రావలెను. అందరూ నీ బోధలు వింటున్నారుగాని నీ తండ్రి, నీ ఇతర బంధుజనులూ వినటం జరగలేదు. మేము నిన్ను చూసి అప్పటికి ఏడేళ్లయినది."

బుద్ధుడికి ఈ సందేశం అందజేయటానికి శుద్ధోదనుడి దూత సపరివారుడై విహారం చేరుకునే సమయానికి బుద్ధుడు సమావేశమైనవారికి ప్రబోధంచేస్తున్నాడు. ఆ క్షత్రియుడూ, ఆయనవెంట వచ్చిన వెయ్యిమంది ప్రబోధం విని బుద్ధుడి శిష్యులైపోయారు. వారు శుద్ధోదనుడి సందేశం బుద్ధుడికి అందించలేదు.

వెళ్లినవారు ఎంతకూ తిరిగి రాకపోవటం చూసి శుద్ధోదనుడు మరొక దూతను పరివారంతోసహా పంపాడు. కాని వారుకూడా మొదటివారిలాగే బుద్ధుడి శిష్యులై విహారంలోనే నిలిచిపోయారు. శుద్ధోదనుడు ఈ విధంగా మరి ఏడుగురు దూతలను పంపాడు. వేలువనం చేరగానే అందరూ బుద్ధుడి శిష్యులయారు, ఒక్కరూ తిరిగి రాలేదు, శుద్ధోదనుడి సందేశం బుద్ధుడికి అందించనుకూడా లేదు.



వారందరూ తనకు ఆప్తులు కాని కారణం చేత తన ఆజ్ఞలను పాలించలేదనుకుని శుద్ధోదనుడు ఈసారి తనకు ఆప్తుడైన కాలుదాయి అనేవాణ్ణి పిలిచి, అతనితో, "నాకు చనిపోయే లోగా నా కుమారుణ్ణి చూడాలని ఉన్నది. వాణ్ణి పిలుచుకురమ్మని తొమ్మిది మందిని తొమ్మిది వేల బలగంతో పంపాను; ఒకడూ తిరిగిరాలేదు. నీవువెళ్ళి వాడితో నేను రమ్మన్నానని చెప్పివస్తావా?" అన్నాడు.

కాలుదాయికూడా బుద్ధుణ్ణి చూడబోయి ప్రబోధం విని ఆయన శిష్యుడుగా చేరి పోయాడు. తరవాత వారంరోజులకు వసంత ఋతువు ఆరంభమయింది. ఎక్కడ చూసినా



పచ్చనిగడ్డి కానవచ్చింది. అరణ్యవృక్షాలన్నీ పుష్పించాయి. బుద్ధుడు తనవారిని చూడ పోవటానికి ఇదే తరుణమని నిర్ణయించి కాలుదాయి ఆయనవద్దకు వెళ్ళి, రాజగృహం నుంచి కపిలవస్తుకు వెళ్ళే మార్గంయొక్క శోభను వర్ణించసాగాడు.

బుద్ధుడీ వర్ణనను కొంతసేపు విని, "ఇదంతా నాకెందుకు చెబుతున్నావు?" అని అడిగాడు.

"మరేమీ లేదు. సూర్యుడికోసం పద్మమూ, చంద్రుడికోసం కమలమూ ఎలా నిరీక్షిస్తాయో, మీ కోసం మీ తండ్రీ, మారు తల్లీ అలా నిరీక్షిస్తున్నారు," అన్నాడు కాలుదాయి.

బుద్ధుడు కాస్సేపు ఆలోచించి, తన జన్మస్థలానికి వెళ్ళే తరుణం సమీపించిందని భావించి, "అలాగే, రేపు ఉదయం బయలు దేరి పోదాం!" అన్నాడు.

మర్నాడు బుద్ధుడు కపిలవస్తునగరానికి ప్రయాణమయాడు. ఆయన వెంట అంగ, మగధదేశాలకు చెందిన శిష్యులు పదివేల మందీ, కపిలవస్తునుంచి వచ్చిన శిష్యులు పదివేలమందీ కదిలారు. వీరు రోజుకు పదహారు మైళ్ళు ప్రయాణం చేస్తూ రెండు నెలలకు కపిలవస్తు చేరుకున్నారు.





బుద్ధుడింకా కపిలవస్తు చేరకపూర్వమే కాలుదాయి ముందు నడిచి శుద్ధోదనుడి ఇంటికి వెళ్లాడు. శుద్ధోదనుడు అతన్ని చూసి పరమానందభరితుడై అతనికి భోజనం పెట్టించాడు. కాని కాలుదాయి ఆ భోజనాన్ని తన భిక్షాపాత్రలో వేసుకుని తిరిగి వెళ్లటానికి లేచాడు.

"ఎందుకు వెళ్లిపోతున్నావు? భోజనం చెయ్యి," అన్నాడు శుద్ధోదనుడు.

"లేదు, నేనీ భోజనాన్ని బుద్ధుడికి ఇస్తాను," అన్నాడు కాలుదాయి.

"బుద్ధుడెక్కడ?" అని శుద్ధోదనుడు అడిగాడు.

"ఇక్కడికే వస్తున్నాడు. దారిలో ఉన్నాడు," అన్నాడు కాలుదాయి.

"బుద్ధుడికి నేను వేరే భోజనం ఇప్పిస్తాను. ఈ ఆహారం తిని మరీ వెళ్లు," అన్నాడు శుద్ధోదనుడు.

కాలుదాయి సరేనని భోజనంచేశాడు. శుద్ధోదనుడు అతని భిక్షాపాత్రను సుగంధ జలంతో కడిగించి, అందులో ఉత్తమమైన ఆహారం పెట్టించి కాలుదాయిద్వారా బుద్ధుడికి పంపాడు.

ఆపూట బుద్ధుడు తన తండ్రి పంపిన ఆహారమే భుజించాడు.



తరవాత శుద్ధోదనమహారాజు బుద్ధుడి విడిదికోసం న్యగ్రోధవనాన్ని సిద్ధం చేయించాడు, అది పూర్వం న్యగ్రోధుడనే శాక్యరాజు నిర్మించినది.

బుద్ధుడు కపిలవస్తునగరద్వారం చేరుకునేసరికి ఆయనకు స్వాగతం చెప్పటానికి వెళ్లే ఊరేగింపుజనంలో ముందుగా అయిదు వందలమంది బాలబాలికలు, సుమారు పదహారేళ్ల వయస్సువాళ్లున్నారు। వారి వెనకగా పన్నెండేళ్ల వయస్సు గల రాజకుమారులూ, రాజకుమార్తెలూ ఉన్నారు। వారి వెనకగా నూట అరవైవేలమంది పరివారంతో రాజుగారు నడిచారు.



ఈ ఊరేగింపువెంట బుద్ధుడు తన విడిది అయిన ఉద్యానం ప్రవేశించి ఒక ఎత్తయిన ఆసనంపైన కూచున్నాడు. ఆయన శిష్యులు అరవైవేలమంది ఆయనచుట్టూ కూచున్నారు. బుద్ధుణ్ణి చూడవచ్చిన శాక్యులలో పెద్దలైనవారు చిన్నవారితో, "మీరు బుద్ధుడికి పాదాభివందనం చెయ్యండి," అని చెప్పి తాము ఎడంగా కూచున్నారు. తాము బుద్ధుడికన్న పెద్దవాళ్లమనీ, బుద్ధుడికి వరసకు పినతండ్రులూ, పెత్తండ్రులూ, తాతలూ అవుతామనీ, అందుచేత వందనం చేయ నవసరంలేదనీ వారు భావించారు.

బుద్ధుడు లేచి నిలబడ్డాడు. మరుక్షణం అక్కడ చేరిన వారందరూ ఇద్దరు బుద్ధులను వేరువేరుగా చూడగలిగారు. ఆయన శరీరంలో నుంచి ఆరు రంగుల కిరణాలు ప్రసరించటం అందరికీ కనిపించింది. తరవాత ఆయన అనాగత వంశవృత్తాంతం అనే మైత్రీ బుద్ధుడి చరిత్ర చెప్పాడు.

బుద్ధుడి ప్రసంగం ముగియగానే శుద్ధోదనమహారాజు లేచి తన కుమారుడి ముందు మూడవసారిగా సాష్టాంగపడి, "నాయనా, బుద్ధభగవానుడా! నీకు లోగడ రెండుసార్లు సాష్టాంగప్రణామం చేసిఉన్నాను. నీవు నా కడుపున కొడుకువై పుట్టినప్పటికీ ఇకనుంచి నిన్ను నాకొడుకుగా భావించను. ఎందుకంటే నేను నీకు దాసుడుగాకూడా పనికిరాను. నాకు తెలుసును. నా రాజ్యమంతా ఇస్తానన్నప్పటికీ అది నీకు బుగ్గితో సమానం!" అన్నాడు.

శుద్ధోదనుడు ఈ మాటలు అనగానే పెద్దలందరి అహంకారమూ అణగారింది. వారందరూ బుద్ధుడికి సాష్టాంగ దండప్రణామాలు చేశారు. సందేహాలున్న వారందరికీ సందేహాలు తీరిపోయాయి.

ఈ సందర్భంలో బుద్ధుడు అక్కడ ఉన్న వారికి విశ్వంతర జాతక కథ చెప్పాడు.

—(ఇంకా వుంది)






## [7]

వున్నారు రాజకుటుంబంవారందరూ బుద్ధుణ్ణి కళ్లారా చూచిన ఆనందంలో వుండి ఆయనకోసం ఆహారం సిద్ధంచెయ్యటం మాటే మరిచారు. ఆ ఉదయం బుద్ధుడు పళ్లు తోముకుని, ముఖం కడుక్కుని ఒక ఏకాంతస్థలంలో ధ్యాననిమగ్నుడయాడు. భోజనంవేళ కాగానే ఆయన లేచి, తన భిక్షాపాత్ర తీసుకుని ప్రతి యింటా భిక్ష తీసుకోవటానికి బయలుదేరాడు.

నగరంలో జనం ఆయనను చూసి ఎగబడ్డారే గాని ఆయన భిక్షానికి బయలుదేరాడనీ, ఏ ఇంటిముందు ఆగితే ఆ యింటివారు భిక్ష పెట్టాలని వారికి తెలియదు. వారికి అలాటి ఆచారం వుంటుందనికూడా తెలియదు. అందుచేత ఏ ఇంటా ఆయనకు భిక్ష లభించలేదు.

బుద్ధుడు ప్రతి ఇంటిముందూ నిలుస్తూ రాజభవనం చేరాడు. అంతఃపుర స్త్రీలు ఆయనను చూడటానికి మేడలు దిగివచ్చి, కిటికీలవద్ద నిలబడ్డారు. యశోధర అదివరకే వినివున్నది: ఈ నగరంలో రథమెక్కి తిరిగిన సిద్ధార్థుడు కేశఖండన చేయించుకుని, కాషాయవస్త్రాలు ధరించి, మట్టిపాత్రలో భిక్షమెత్తుకుంటున్నాడట! ఈ వేషంలో ఆయన ఎలా వున్నాడో చూడాలని ఆమెకూడా ఒక ద్వారంవద్ద నిలబడింది.

బుద్ధుడు రాగానే ఆమె ఆయనకు మనసులో నమస్కారంపెట్టుకుని, "రాహులుడు





పుట్టినవాడు సమస్తాన్నీ, రాజ్యాన్నీ త్యజించి వెళ్ళిపోయి, అంతకంటె గొప్ప రాజ్యాన్ని సంపాదించుకున్నావా, సిద్ధార్థా?" అనుకున్నది. తరవాత ఆమె తన మామగారైన శుద్ధోదనుడివద్దకు వెళ్ళి, "మీ కొడుకు ఇంటింటా బిచ్చమెత్తుతూ యిక్కడికి వస్తున్నాడు!" అని చెప్పింది.

శుద్ధోదనుడు ఈ మాట వింటూనే ఆవేశపరవశుడై బుద్ధుడివద్దకు పరిగెత్తి వెళ్ళి, "నాయనా, నీవెంట జంబూద్వీపంలో ఉండే రాజులు సపరివారంగా వచ్చినా అందరికీ భోజనాలు పెట్టగలనే, నీకూ నీ అరవై వేలమంది శిష్యులకూ భోజనం పెట్టలేనా? ఎందుకుగాను బిచ్చమెత్తవలసి వచ్చింది?" అని అడిగాడు.

"అది నా జాతిధర్మం!" అన్నాడు బుద్ధుడు.

శుద్ధోదనుడు విస్తుపోయి, "జాతిధర్మమా? నీవు మహా సమ్మతుడి జాతిలో జన్మించావు, నాయనా! ఆ జాతికి చెందినవారెవరూ ఎన్నడూ, ఈ విధంగా బిచ్చమెత్తలేదే!" అన్నాడు.

"నేను సమ్మతుడి జాతిని గురించి మాట్లాడలేదు, బుద్ధుల జాతిగురించి చెప్పాను. కొడుకుకు పెన్నిధి దొరికితే అందులో గల ముఖ్య రత్నాలను తండ్రికి సమర్పించటం కుమారుడి విధి. అందుచేత నాకు దొరికిన అమూల్య రత్నాలను నీకిస్తాను తీసుకో, తాత్సారం చేయవద్దు, ధర్మం తెలుసుకుని శుభం పొందు. ధర్మం ప్రకారం స్వీకరించదగినదెల్లా స్వీకరించి, విసర్జించవలసినదెల్లా విసర్జించు. ధర్మాన్ని పాలించినవారు శుభాలు పొందుతారు," అని బుద్ధుడు పదిపిధిలో తండ్రికి ధర్మోపదేశం చేశాడు.

బుద్ధుడు చేసిన ప్రబోధం విన్నాక శుద్ధోదనుడు తన కొడుకు చేతిలోని భిక్షాపాత్ర తాను తీసుకుని, బుద్ధుడికీ, ఆయన వెంట









ఉన్న శిష్యులకూ భోజనాలు పెట్టించారు. భోజనాల అనంతరం రాజభవనానికి చెందిన నలభైవేల మంది స్త్రీలు బుద్ధుడికి వందనాలు చేసుకున్నారు.

వారిలో యశోధర లేకపోవటం గమనించి శుద్ధోదనుడు ఆమెనుకూడా రమ్మని కబురు చేశాడు. "ఆయనకు నాపై ఆదరం ఉన్న పక్షంలో ఆయనే నావద్దకు వస్తాడు. అప్పుడు నేనాయనను పూజిస్తాను." అని యశోధర సమాధానం పంపింది.

ఈమాట విని బుద్ధుడు యశోధరను చూడటానికి ఆమె ఉంటే గదికి బయలుదేరాడు. దారిలో ఆయన తన ప్రధాన శిష్యులైన మొగలానుడితోనూ, సారిపుత్తుడితోనూ, "ఈమె అనేక జన్మలలో నాకు ఎంతో సాయపడింది. ఇప్పుడామె జన్మ రాహిత్యం పొందబోతున్నది. తుచ్ఛమైన కామాన్ని నేను జయించాను గాని ఆమె ఇంకా జయించలేదు. నన్ను చూసి చాలా కాలమైనందున ఆమె మనసు చాలా వేదన పడుతున్నది. ఈ వేదనను బయటికి రానివ్వక అణచినట్టయితే ఆమె గుండె పగిలి పోతుంది. ఆమె నా పాదాలు అంటవచ్చు; కాని అలా చేయనిచ్చినందువల్ల ఆమె సన్యాసిని అయి మనలో చేరిపోతుంది.



కనుక మీరామెను నివారించకండి!" అని చెప్పారు.

బుద్ధుడు తనను చూడవస్తున్నాడని తెలియగానే యశోధర నారబట్టలు కట్టుకుని ఎదురు వెళ్ళింది. ఆమె బుద్ధుణ్ణి చూస్తూనే, తప్పని తెలిసికూడా, ఆయన పాదాలు పట్టుకుని భోరుమని ఏడిచింది.

మరుక్షణం తన మామగారు అక్కడే నిలబడి ఉండటం తెలుసుకుని సిగ్గుపడుతూ లేచి నిలబడింది.

"ఈమె నీపైగల ప్రేమకొద్దీ ఇలా ప్రవర్తించింది. ఆమెను క్షమించు," అన్నాడు శుద్ధోదనుడు బుద్ధుడితో.





"ఈమె అనేక జన్మలలో నాకు సహ ధర్మచారిణిగా ఉండి బుద్ధుడికి భార్యఅయే అర్హత సంపాదించుకున్నది," అంటూ బుద్ధుడు ఆమె పూర్వజన్మల వృత్తాంతం గురించి చెప్పాడు.

అది విన్నమీదట యశోధరాదేవి దుఃఖం మాని ఊరట చెందింది.

శుద్ధోదన మహారాజు రెండవ భార్య అయిన మహాప్రజావతికి నందుడని ఒక కుమారుడున్నాడు. బుద్ధుడు యశోధరను చూసిన మర్నాడే నందుడి వివాహ మహోత్సవం ఏర్పాటయింది. దానితోబాటు నూతన గృహప్రవేశంకూడా జరగనున్నది.

అందుచేత ఆ రోజు ఉదయం బుద్ధుడు నిగ్రోధవనం నుంచి ఈ ఉత్సవ మంటపానికి వెళ్లాడు. ఆయనవెంట అర్హతులందరూ ఉన్నారు. నందుణ్ణి మోక్షమార్గంలో పెట్టటమే బుద్ధుడి ఉద్దేశం.

ఆయన తనకు వేసిన ప్రత్యేకాసనంపై కూచుని నందుడితో, "నిజమైన ఉత్సవ మంటే ఏమిటో తెలుసునా? తుచ్ఛమైన కోరికలను నిర్మూలించటం, బ్రహ్మచర్యం అవలంబించటం, నాలుగు సత్యాలను తెలుసుకోవటం, నిర్వాణం అంటే ఏమిటో అర్థం చేసుకోవటం," అంటూ అతనికి ధర్మోపదేశం చేశాడు.





త్వరలోనే నందుడు బుద్ధుడి మార్గం అవలంబించటానికి సిద్ధపడ్డాడు. బుద్ధుడు అతని చేతిలో భిక్షాపాత్ర ఉంచి తన విహారానికి బయలుదేరాడు. పెళ్ళికొడుకువేషంలో ఉన్న నందుడు భిక్షాపాత్ర చేతబట్టి బుద్ధుడి వెనకనే విహారానికి వెళ్ళాడు.

పెళ్ళికూతురు పేరు జనపదకల్యాణి. ఆమె కిటికీలోనుంచి, తన కాబోయే భర్త బుద్ధుడి వెంట వెళ్ళిపోతూండటం చూసి, ఎక్కడికి పోతున్నావని ప్రశ్నించింది. కాని నందుడు జవాబు చెప్పలేదు.

ఇద్దరూ విహారం చేరుకున్నాక బుద్ధుడు నందుడితో, "రాజ్యాకాంక్షలు తొలగించుకుని నాలాగే సన్యాసం స్వీకరించు!" అన్నారు. నందుడి మనస్సు చంచలంగా ఉన్నది. అతను పెళ్ళికూతురిని గురించే ఆలోచిస్తూ పైకిమాత్రం ఏమీ అనలేదు. అందుచేత బుద్ధుడు తన ప్రధాన శిష్యులతో, "ఇతనికి సన్యాసం ఇవ్వండి," అన్నారు.

అది మొదలు నందుడు మనోవ్యాధితో చిక్కిపోసాగాడు. ఇలా చిక్కిపోవటానికి కారణమేమని మిగిలినవారు అతన్ని అడిగారు. "నీవు బుద్ధుడికి సవతి తమ్ముడివి, రాజవంశంవాడివి, ఏలోటూ ఎరగనివాడివి, నీకు విచారం ఉండవలసిన పని లేదే!" అని వారన్నారు.





"నేను బుద్ధుడి చేతినుంచి భిక్షాపాత్ర తీసుకుని బయలుదేరినప్పుడు పెళ్లికుమార్తె అయిన జనపదకల్యాణి నన్ను వెంటనే తిరిగి రమ్మన్నది. ఆమె కారణంగానే నాకీ చింత పట్టుకున్నది!" అన్నాడు నందుడు ఎంతో విచారపడుతూ.

ఈ సంగతి బుద్ధుడికి తెలిసింది. ఆయన నందుడితో, "నీకు కాబోయే భార్య చాలా చక్కనిదా?" అన్నారు.

"చాలా చక్కనిది!" అంటూ నందు డామెను దీర్ఘంగా వర్ణించాడు.

"అంతకంటె అందగత్తెలు ప్రపంచంలో లేరా?" అన్నారు బుద్ధుడు.



"జంబూద్వీపంలో ఎక్కడా లేరు!" అన్నాడు నందుడు.

బుద్ధుడు తన శక్తిచేత నందుడికి దేవతా స్త్రీలను చూపి, "జనపదకల్యాణి వీరికన్న అందంగా ఉంటుందా?" అని అడిగారు.

"వీరితో పోలిస్తే చాలా వికారంగా ఉంటుంది!" అన్నాడు నందుడు.

"అయితే వీరిలో ఎవరినైనా భార్యగా స్వీకరిస్తావా?" అని బుద్ధుడు అడిగారు.

"అది ఎలా సాధ్యం?" అన్నాడు నందుడు.

"నేను చెప్పే బోధలు ఆలకించి, వాటి ప్రకారం నడుచుకుంటే అది సాధ్యమవుతుంది." అన్నాడు బుద్ధుడు.

ఈ మాటలతో నందుడి విచారం విరిగిపోయింది. అతను బుద్ధుడి బోధలు విని త్వరలోనే అర్హతుల శ్రేణిలో చేరిపోయాడు.

బుద్ధుడు కపిలవస్తునగరం చేరి సరిగా వారమయింది. యశోధర తన ఏడేళ్ల కొడుకును రాహులుణ్ణి చక్కగా అలంకరించి, "నాయనా, ఎంతో తేజస్సుతో వెలిగిపోతూండే ఈ సన్యాసి నీ తండ్రి. ఆయన దగ్గర గొప్ప నిధులున్నాయి. నీవు ఆయనకు వారసుడవు గనక వెళ్లి వాటిని పుచ్చుకో!" అన్నది.



"నాకు తండ్రి ఎవరమ్మా?" అని రాహులుడు అడిగాడు.

యశోధర కిటికీలోనుంచి రాహులుడికి బుద్ధుణ్ణి చూపించింది. ఆ సమయంలో బుద్ధుడు రాజభవనానికి వచ్చి భోజనం చేస్తున్నాడు. ఆయనను రాహులుడికి చూపుతూ, "ఆయనే నీ తండ్రి!" అని చెప్పింది యశోధర.

రాహులుడు బుద్ధుడు భోజనంచేసే చోటికి వెళ్ళి మొదట, "నాన్నా!" అని పిలిచాడు. తరవాత ఆతను నిర్భయంగా, "ఓ సన్యాసీ, నీ అండ నాకు అమూల్యం!" అన్నాడు.

బుద్ధుడు భోజనం ముగించి, రాహులుణ్ణి ఆశీర్వదించాడు. "నీదగ్గిర ఏవో నిధులున్నాయట, అమ్మ చెప్పింది. వాటిని నాకిస్తావా?" అని రాహులుడు అడిగాడు. బుద్ధుడు వెళ్ళిపోయేటప్పుడు రాహులుడు ఆయనవెంట బయలుదేరాడు. ఆతన్ని బుద్ధుడుగాని ఇతరులుగాని వారించలేదు. తన కుమారుడు బుద్ధుడివెంట పోతూ ఉండటం కిటికీలోనుంచి గమనించిన యశోధరమటుకు, రాహులుడుకూడా నందుడిలాగే సన్యాసం తీసుకుంటాడేమోనని భయపడి, దుఃఖించింది. రాహులుణ్ణి వెంట పెట్టుకుని విహారం చేరాక బుద్ధుడు సారి



యుతుడితో, "రాహులుడు నా ఆస్తికోసం అడుగుతున్నారు. దుఃఖానికి దారితీసే ఆస్తి ఏదీ వాడికివ్వదలచలేదు, శాశ్వత సుఖాన్నిచ్చే సన్యాసం వాడికిస్తాను!" అన్నారు.

తరవాత సేరియుతుడు రాహులుడికి సన్యాసం ఇచ్చారు. ఈ వార్త తెలిసి శుద్ధోదనుడు చాలా విచారపడ్డారు. ఆయన బుద్ధుడివద్దకు వెళ్లి, "నా కొడుకులిద్దరూ—సిద్ధార్థుడూ, నందుడూ—సన్యసించారు. ఇప్పుడు నా మనవడు రాహులుడుకూడా సన్యసించాడు! వాళ్లని ఇంతకాలమూ నా కొడుకులాగా చూసుకుంటున్నాను. వాళ్లని కూడా నాకు దూరం చేయటం న్యాయం కాదు!" అని ఆవేదన తెలిపారు.

"ఇక మీదట తల్లిదండ్రుల అనుమతి లేనిదే ఎవరికీ సన్యాసం ఇవ్వము!" అని బుద్ధుడు శుద్ధోదనుడికి మాట ఇచ్చారు.

బుద్ధత్వం సంపాదించిన తొమ్మిదవ నెలలో గౌతముడు తొలిసారిగా సింహళానికి వెళ్లారు. ఆయన మహావెలి నదీతీరాన మహనాగ అనే పేరుగల ఉద్యానవనం వద్ద దిగారు. ఆ కాలంలో ఆ ప్రాంతాన యక్షులనే జాతివారి మధ్య అంతఃకలహాలూ, యుద్ధాలూ తీవ్రంగా సాగుతూండేవి. ఆ యక్షులు బుద్ధుడికి తమ ఉద్యానవనంలో లేడిచర్మం మేర చోటుమాత్రమే ఇవ్వటానికి ఒప్పుకున్నారు. కాని బుద్ధుడు అక్కడ చేరినవారిని తన ప్రబోధాలద్వారా మంచి మార్గానికి తిప్పారు. తరవాత ఆయన సింహళద్వీపాన్ని మూడుసార్లు చుట్టి తన మతాన్ని ప్రచారంచేసి వేలువనానికి తిరిగి వచ్చేశారు.

(ఆటుతరవాత బుద్ధుడు సింహళానికి మరిరెండుసార్లు వెళ్లారు. ఆయన శిష్యులు ఆయన జ్ఞాపకార్థం అక్కడ అనేక స్థూపాలు నిర్మించి, ఆయన చెప్పిన నియమాలను ఆచరించుతూ బౌద్ధమతాన్ని సజీవంగా ఉంచారు.) (ఇంకా ఉంది)






[8]

బింబిసారుడు పరిపాలించే కాలంలో రాజగృహంలో కాలవలి అనే ఒక పేదవాడుండేవాడు. ఒకనాడు వాడికెక్కడా పని దొరకలేదు. అందుచేత వాడి భార్య ఆ రోజు ఇంత అంబలి కాచింది. బుద్ధుడి శిష్యులలో ఒకడైన మహాకాశ్యపుడు అనాడే ఆ పేద వాడి ఇంటివద్దకు భిక్షాపాత్రతో వచ్చాడు. కాలవలి భార్య తనకున్న అంబలే భిక్షాపాత్రలో పోసింది. మహాకాశ్యపుడు ఆ అంబలిని తీసుకుపోయి బుద్ధుడికిచ్చి, "ఈ అంబలి పోసిన స్త్రీకి కలిగే ప్రతిఫలం ఏమిటి?" అని అడిగాడు.

"ఒక వారం రోజులలో ఆ స్త్రీ గొప్ప ఇంటిదవుతుంది," అన్నాడు బుద్ధుడు.

అది జరిగిన ఏడవ రోజున రాజుగారు శ్మశానంమీదుగా వెళుతూ అక్కడ కొరత బడి ఇంకా ప్రాణాలతో ఉన్న నేరస్థుణ్ణి ఒకణ్ణి చూసి, "నావల్ల నీకు కావలసిన ఉపకారం ఏమైనా ఉన్నదా?" అని అడిగాడు.

"నాకు ఆకలిగా ఉన్నది. రాజభవనం నుంచి నాకు భోజనం పంపించాలి!" అని నేరస్థుడు అడిగాడు.

రాజుగారు వాణ్ణి చూసి జాలిపడి సరే నన్నారు. ఆ రాత్రి ఆయన తన అధికారులతో, "శ్మశానంలో కొరతపడిన వాడికి ఎవరిచేతనైనా నా వంటకాలమంచి భోజనం పంపండి!" అన్నాడు.



కాలవరి భార్య నడిచేవని తాటిచెట్టు వద్దకు రాగానే, "ఓ సుమనా, నీ కూతురు కాళికి మగపిల్లవాడు పుట్టాడు!" అని కేక పెట్టింది.

తాటిచెట్టుపైన ఉన్న సుమనుడు, "చాలా మంచివార్త తెచ్చావు! ఈ తాటి చెట్టు మొదట్లో నిధి ఉన్నది, బహుమానంగా దాన్ని తవ్వుకు పో!" అని కేక పెట్టాడు.

ఆ స్త్రీ అక్కడినుంచి బయలుదేరి శ్మశానంలో కొరతవేసిన నేరస్థుడి వద్దకు వెళ్లి, "రాజుగారి ఇంటినుంచి భోజనం తెచ్చాను, తింటావా?" అన్నది.

శరీరబాధకన్న ఆకలిబాధ ఎక్కువగా ఉండటంచేత వాడు, "పెట్టు!" అని, ఆమె చేత పెట్టించుకుని ఆవురావురుమని అన్నం తినేశాడు. తరవాత వాడు ఆమెను, "నా మాట కాస్త విను!" అన్నాడు. మాట వినటానికి దగ్గిరికి రాగా వాడామె జుట్టును తన నోటితో గట్టిగా పట్టి వదలలేదు.

చేసేది లేక కాలవరి భార్య తన వెంట తెచ్చిన కత్తితో వాడి నోట చిక్కిన జుట్టును కోసేసి రాజభవనానికి తిరిగి వచ్చింది.

"నువ్వు శ్మశానానికి వెళ్లి నేరస్థుడికి అన్నం పెట్టినట్టు రుజువేమిటి?" అని రాజుగారు అడగగా ఆమె, "మహారాజా, నేను కోసేసిన జుట్టు నేరస్థుడి నోట కనిపిస్తుంది. అదిగాక

శ్మశానానికి ఆ నిశిరాత్రివేళ ఆహారం తీసుకుపోయే మనిషి వారికి దొరకలేదు. కాలవరి భార్య అందుకు సమ్మతించింది. ఆమె శ్మశానానికి పోతూండగా దారిలో ఒక చెట్టుమీద ఉండే పిశాచం, "ఆ భోజనం నాకేనా ఏమిటి?" అని ప్రశ్నించింది.

"కాదు. శ్మశానంలో ఉన్న ఇంకొక మనిషికి!" అని స్త్రీ జవాబు చెప్పింది.

"ఇదుగో చూడూ! నువ్వు వెళ్లే దారిలో పలాని తాటిచెట్టుపైన దేవసుమనుడు ఉంటాడు. ఆయనతో, నీ కూతురు కాళికి మగపిల్లవాణ్ణి కన్నదని కేకవేసి చెప్పిపోగలవా?" అన్నది పిశాచం.



దారిలో ఉన్న తాటిచెట్టు మొదట్లో నిధి ఉన్నదనీ, దాన్ని తవ్వి తీసుకోమనీ నాతో పిశాచాలు చెప్పాయి!" అన్నది.

మర్నాడు రాజుగారు ఆమె చెప్పిన రెండు విషయాలనూ రుజువుచేసుకున్నారు. తాటిచెట్టు మొదట తవ్వగా ఆ పేదస్త్రీ చెప్పినట్టే నిధి దొరికింది. రాజుగారు ఆమె ధైర్యానికీ, అదృష్టానికీ మెచ్చి ఆమెకూ, ఆమె భర్తకూ అగ్రస్థానం ఇప్పించారు. బుద్ధుడు చెప్పిన మాట నిజమయింది.



• • •

రాజగృహం సమీపంలో ఏకనాలకం అనే గ్రామం ఉండేది. ఆ గ్రామంలో కాశీ భారద్వాజుడనే బ్రాహ్మణు డుండేవాడు. ఆయన ఒక ఏడు పొలాలు దున్నే ఉత్సవం ఏర్పాటు చేశాడు. ఆ కాలంలో ఇది ఒక గొప్ప పండగ. ఈ ఉత్సవానికి అయిదు వందల నాగళ్లకు వెయ్యి ఎడ్లను కట్టారు. ఎద్దుల గిట్టలకు వెండిరేకులు తొడిగారు. వాటి మెడలకు పూలమాలలు చుట్టారు. నాగళ్లకూ ములుకోలలకూ బంగారు పొన్నులు వేశారు. కాడి పట్టేవాళ్లంతా రంగు రంగుల బట్టలు ధరించారు. వేలాది జనం ఉత్సవం చూడవచ్చారు. ఈ ఉత్సవం చూడటానికి బుద్ధుడుకూడా వచ్చాడు. ఆసమయంలో ఆయన దక్షిణగిరి అనే విహారంలో ఉంటున్నాడు.

ఉత్సవానికి ముందుగా బ్రాహ్మణుడి భార్య బండిపై వేసి తెచ్చిన అన్నమూ, నెయ్యీ, మిఠాయి మొదలైనవి అందరికీ పంచిపెట్టింది. బ్రాహ్మణుడు ఎవరి కేమి కావాలో కనుక్కుంటూ, "ఇక్కడ అన్నం వడ్డించు. ఇక్కడ నెయ్యి వడ్డించు," అని తన భార్యను హెచ్చరిస్తూ వచ్చాడు.

భోజనాలు ముగిసినవాళా బుద్ధుడు ఒక ఎత్తయిన చోట నిలబడ్డాడు. ఉత్సవానికి వచ్చిన జనం ఉత్సవంమాట మరిచిపోయి ఆయనచుట్టూ మూగారు. ఇదిచూసి బ్రాహ్మ







బుడు, " ఈ సన్యాసి ఉత్సవం పాడుచేయ వచ్చినట్టున్నది !" అని విసుక్కున్నారు.

ఆయన బుద్ధుడివద్దకు వెళ్లి, " అయ్యా, శ్రమణా! నేను భూమిని దున్ని, విత్తులు చల్లి, పంట పండించి, కృషిఫలితాన్ని అనుభవిస్తున్నాను. నీవుకూడా నాలాగే కృషి చేసినట్టయితే తిండికి ఏలోటూ లేకుండా సుఖంగా ఉండవచ్చుగద !" అన్నారు.

" ఓ బ్రాహ్మణా! నేనూ నీలాగే కర్షకుణ్ణే. అయితే నేను పండించే పంట అమృతమయమైనది !" అన్నాడు బుద్ధుడు.

బుద్ధుడి మాటలు బ్రాహ్మణుడికి అర్థం కాలేదు. అందుచేత ఆయన " అయ్యా, మీరు కృషి చేస్తామంటున్నారుగాని మీ నాగలి, ములుకోలా, ఎద్దులూ మొదలైనవి కనిపించవే !" అన్నాడు.

" నేను ధర్మమనే పొలాన్ని, జ్ఞానమనే నాగలితో దున్ని, పవిత్రత అనే విత్తులు చల్లి, నియమాచరణ అన్న వ్యవసాయంతో నిర్వాణమనే పంట పండిస్తాను ; జన్మకాంక్ష అనే కలుపు తీస్తాను !" అని బుద్ధుడు జవాబు చెప్పాడు. తరవాత ఆయన బ్రాహ్మణుడితో, " నీవుకూడా ఇలాంటి కృషి ప్రారంభించు !" అన్నాడు.

బ్రాహ్మణుడు బుద్ధుడి బోధలు విని సంతోషించి ఆయనకు మేలైన ఆహారం ఇవ్వబోయాడు. కాని బుద్ధుడు దాన్ని నిరాకరించి, " ప్రజలకు వినోదం చేకూర్చి ప్రతిఫలం పొందటానికి నేను గాయక నర్తకుల లాటివాణ్ణి కాను. ప్రబోధించినందుకు ప్రతిఫలం పుచ్చుకోవటం నా నియమాలకు విరుద్ధం !" అన్నాడు.

బుద్ధుడికి నివేదించిన ఆహారం మరొకరికి పెట్టటం అనుచితంగా తోచినందువల్ల దాన్ని బ్రాహ్మణుడు నీటిలో వదిలిపెట్టి, బుద్ధుడి వెంట చేరి కాలక్రమాన అర్హతుడయాడు.

శ్రావస్తినగరంలో అనాథపిండుడు అనే ఒక కోటీశ్వరుడుండేవాడు. ఆయనకు రాజ





గృహంలో ఉండే ఒక వర్తకుడు అత్త మిత్రుడు. ఒకరి ఊరికి మరొకరు వచ్చినప్పుడల్లా వారు ఎంతో ఆప్యాయంగా ఎదురు వెళ్ళి, ఇంటికి తెచ్చి ఆదరిస్తూండేవారు.

ఒకసారి అనేపీడుడు అయిదువందల బళ్ళపై సరుకు వేసుకుని రాజగృహానికి బయలుదేరి వచ్చారు. తన మిత్రుడు ఊరి బయట తనకు ఎదురు రాకపోవటం చూసి ఆశ్చర్యపోయారు.

అనేపీడుడు తన మిత్రుడుండే వీధికి వచ్చారు, ఇంటికికూడా వచ్చారు, మిత్రుడు ఎదురు రాలేదు. అనేపీడుడు ఇంట్లోకి వెళ్ళి తన మిత్రుణ్ణి చూశారు. కాని ఆయన ఏదో పనితొందరలో ఉన్నవాడిలాగా అనేపీడుడితో లాంఛనగా రెండు మాటలు మాట్లాడి తన పని తాను చూసుకున్నారు.

ఆ రాత్రిమటుకు ఆ మిత్రుడు అనేపీడుడి వద్దకు వచ్చి, "నేను నీ సంగతి సరిగా విచారించనందుకు మరొకలాగ అనుకోకు. రేపు బుద్ధుడికీ, ఆయన పరివారానికీ ఆతిథ్యం ఇస్తున్నాను. పనితొందరలో నీతో మాట్లాడే అవకాశం లేకపోయింది," అన్నారు.

బుద్ధుడి పేరు చెవిని పడగానే అనేపీడుడికి ఆయనను అప్పటికప్పుడే చూడాలన్న కోరిక కలిగింది. కాని అతని మిత్రుడు, "అప్పు



డాయన పడుకుని నిద్రపోతూంటారు. మనం వెళ్ళితే నిద్రాభంగమవుతుంది!" అన్నారు.

చేసేది లేక అనేపీడుడు వెళ్ళి పడుకున్నారు. కాని ఒక జాము గడిచేసరికల్లా అతనికి మెలుకువ వచ్చింది. బయట చూస్తే వెలుతురుగా వున్నది. తెల్లవారిపోయిందనుకుని అనేపీడుడు బయటికి వచ్చి, తాను చూసిన వెలుతురు వెన్నెల అని గ్రహించి, మళ్ళీ లోపలికి వెళ్ళి పడుకున్నారు. మరొక జాము గడిచాక అనేపీడుడు తిరిగి అదే భ్రమకు లోనయారు. ఆయన మూడవ జామున మూడవసారి లేచి, "ఈసరికి నిజంగా తెల్లవారేవుంటుంది. నేను విహా



రానికి బయలుదేరి బుద్ధుడి దర్శనం చేసుకుంటాను!" అనుకుని బయలుదేరాడు.

ఆయన దారిలో ఇలా వితర్కించుకున్నాడు: "ఈ కాలంలో బుద్ధులమని చెప్పుకుంటూ తిరుగుతున్నవారు చాలా మంది ఉన్నారు. నేను మోసపోతానేమో! నా తల్లిదండ్రులు చిన్నతనంలో నన్ను సుదత్తుడని పిలిచేవారు. ఈ సంగతి ఎవరికీ తెలియదు. ఈ బుద్ధుడు నా చిన్ననాటి పేరు చెప్పాడా, ఆయనను నమ్ముతాను. లేదా, ఇంకొక బుద్ధుణ్ణి వెతుక్కుంటాను!"

అనేపిడుడు విహారం ప్రవేశించగానే బుద్ధుడే స్వయంగా ఎదురువచ్చి, "రా,



సుదత్తా!" అని పలకరించాడు. ఈ పిలుపుతో అనేపిడుడి సందేహాలన్నీ పటాపంచలయిపోయి అతనికి బుద్ధుడిలో పూర్తి విశ్వాసం కుదిరింది. అతను తన జీవితాంతం వరకూ బుద్ధుణ్ణి ఆశ్రయించ నిశ్చయించాడు.

బుద్ధుడు అనేపిడుడికి ధర్మం ఉపదేశించాడు. అనేపిడుడు బుద్ధుణ్ణీ, ఆయన పరివారాన్నీ మర్నాడు తన భిక్ష స్వీకరించమని ప్రార్థించాడు. ఇందుకయే ఖర్చు సమస్తమూ తానే భరించి, తన మిత్రుడి సహాయమూ, తదితరుల సహాయమూ నిరాకరించాడు. భిక్ష అయిపోయాక ఆయన బుద్ధుణ్ణి శ్రావస్తికి రావలసిందిగా ఆహ్వానిస్తూ, "శ్రావస్తి రాజు మూడువందల యోజనాల పరిమితి గల కాశీ కోసల దేశాలను పరిపాలిస్తున్నాడు. నేను మహా ధనికుణ్ణి. మీరు వేంచేసినట్టయితే మీకు ఏలోటూ లేకుండా అన్ని ఏర్పాట్లూ చేయగలను," అన్నాడు.

రాజగృహంనుంచి శ్రావస్తికి 45 యోజనాలు. ఈ మధ్య గల మార్గం వెంబడి బుద్ధుడికోసం అనేపిడుడు చక్కని మజిలీలు ఏర్పాటు చేయించి, దారి అంతా అలంకరింపజేశాడు. బుద్ధుడికోసమూ, ఆయన పరివారంకోసమూ విహారం నిర్మించ





దానికి యోగ్యమైనదిగా ఒక స్థలం ఎన్నుకున్నాడు. ఆ స్థలం అయిదువందల గజాల చదరం. అది జేతుడనే రాజుది.

అనేపిడుడు జేతుడి వద్దకు వెళ్ళి, "మీ స్థలం అమ్ముతారా ?" అని అడిగాడు.

"అది మీకు కావాలంటే దాని మేర యావత్తూ బంగారు మనురణాలు పరిచి ఇస్తే ఆ వెలకు అమ్ముతాను," అన్నాడు జేతుడు, అమ్మనని నోటితో అనకుండా.

"బంగారు మనురణాలు పరుస్తాను. ఆ స్థలం అమ్మండి!" అన్నాడు అనేపిడుడు.

ఆయన నిజంగా కొనే ఉద్దేశంతో వున్నాడని తెలియగానే జేతుడు ఆ స్థలాన్ని అమ్మననేగాడు. కాని అనేపిడుడు అమ్మితీరాలనీ, బేరం కుదిరిందనీ పట్టుపట్టాడు. వ్యవహారం న్యాయస్థానానికెక్కింది. న్యాయస్థానంలో అనేపిడుడికి అనుకూలంగా తీర్పుచెప్పారు.

అనేపిడుడూ జేతుడూ కలిసి ఆ స్థలానికి వెళ్లారు. మామిడిచెట్లూ, గంధపుచెట్లూ మొదలైనవి తప్ప మిగిలిన చెట్లన్నిటినీ అనేపిడుడు కొట్టించి, ఆ చోటంతా సమం చేయించాడు. తరవాత ఆయన తన సొత్తంతా తెప్పించి తాను కొన్న చోటంతా మనురణాలు వెయ్యమంది మనుషులచేత పరిపించాడు. చెట్లున్నచోట అవి లేకపోతే అక్కడ ఎన్ని మనురణాలు పరచటానికి వీలుండేదో అవికూడా లెక్కలో చెల్లించాడు.

అనేపిడుడి తాత ముత్తాతలు ఏడు తరాలుగా కూడబెట్టిన బంగారునాణాలు బయటికి వచ్చాయి. 18 కోట్ల మనురణాలు పరచటం అయింది, కాని ఇంకా పరచవలసిన జాగా వున్నది.

"ఈ అనేపిడుడు ఎంత పుణ్యం సంపాదించబోతున్నాడో తెలియదు. 18 కోట్ల మనురణాలు పరిచాడు. ఇంకా అన్ని పరచటానికికూడా సిద్ధంగావున్నాడు. నేనుమాత్రం కొంత పుణ్యం యెందుకు సంపాదించకూడదు?" అనుకుని జేతుడు అనేపిడుడితో,





"ఇక చాలు! నా స్థలం ఖరీదు నాకు ముట్టింది!" అన్నాడు.

తరవాత అనేపిడుడు విహారభవనాలు నిర్మించాడు. బౌద్ధసన్యాసులు ఉండటానికి, పగలు సమావేశాలకూ, రాత్రి నిద్రకూ వేరు వేరు భవనాలు కట్టారు; కోనేరులు తవ్వారు; పుష్ప ఫలవృక్షాల తోటలు వేశారు. ఈ ఆవరణ చుట్టూ అనేపిడుడు 2 వేల గజాల నిడివి గల ప్రహరీగోడ తొమ్మిది గజాల ఎత్తున కట్టించాడు.

ఈ విహారం నిర్మించటంలో అనేకమంది మిత్రులు అనేపిడుడికి శరీర సహాయమూ, ధనసహాయమూకూడా చేశారు. వీటన్నింటి కిందా మరి 18 కోట్లు ఖర్చయింది.

ఇదంతా చూసిన పిదప జేతుడికి తన స్థలం తాలూకు 18 కోట్లు ఉంచుకో బుద్ధి పుట్టలేదు. ఆయన ఆ సొమ్ముతో విహారం నాలుగు పక్కలా నాలుగు దివ్య భవనాలు, ఏడేసి అంతస్తులు గలవి, కట్టించేశాడు.

ఈ విధంగా 54 కోట్ల సువర్ణాల ఖర్చుతో జేతవనం తయారయింది. ఈ ఏర్పాట్లన్నీ పూర్తి కాగానే బుద్ధుడికి ఆహ్వానం వెళ్ళింది. ఆయన తన అనుచరులతో బయలుదేరి పదహారేసి మైళ్ళకు మజిలీ చేస్తూ రాజగృహంనుంచి శ్రావస్తికి చేరుకున్నాడు. నగరం వెలపల బుద్ధుడికి ఒక బ్రహ్మాండమైన ఊరేగింపు ఎదురు వచ్చింది. దాని వెంబడి అనేపిడుడూ, ఆయన ఇద్దరు కుమార్తెలూ ఉన్నారు.

అనేపిడుడు బుద్ధుణ్ణి విహారానికి తీసుకుపోయి, "దీనిని ఎవరి పేర ధారపోయమన్నారు?" అని అడిగాడు.

"అప్పుడున్న బౌద్ధులకూ, ముందు రాబోయే బౌద్ధులకూ ఈ విహారాన్ని అంకితం చెయ్యి!" అని బుద్ధుడు అనేపిడుణ్ణి ఆదేశించాడు. అనేపిడుడు విహారాన్ని బౌద్ధ సన్యాసులకు అంకితం చేసేశాడు.

—(ఇంకా వుంది)






## [9]

అంగ మగధదేశాలలో అయిదుగురు కోటీశ్వరులైన వర్తకులుండేవారు. వారిలో మేదుడు ఒకడు. ఆయనకు చంద్రపద్మ అనే కూతురూ, ధనంజయుడనే కొడుకూ వుండేవారు. ధనంజయుడి భార్యపేరు సుమన. వారికి విశాఖ అని ఏడేళ్ళ వయసుగల చక్కని కూతురుండేది.

ఇలా వుండగా బుద్ధుడు అంగదేశంలోని భద్రి అనే గ్రామానికి వస్తున్నట్టు వార్త వచ్చింది. మేదుడు తన కొడుకు ధనంజయుడితో, "మన విశాఖను బుద్ధుడివద్దకు పంపు, చూసి వస్తుంది," అన్నాడు. విశాఖ బుద్ధుణ్ణి చూడటానికి ఉబలాటపడింది. ఆమెవెంట ఐదు ఆడపిల్లలను రథాలలో పంపారు. విశాఖ బుద్ధుణ్ణి సమీపించేటప్పుడు రథం నుంచి దిగి కాలినడకను ఆయన వద్దకు వెళ్ళింది.

బుద్ధుడు ఆ పిల్లను చూడగానే, "ఈమె నా ప్రధాన శిష్యురాలై నా శిష్యులందరికీ తల్లిలాగా వుంటుంది!" అనుకున్నాడు. ఆయన విశాఖకూ, ఆమెవెంట వచ్చిన అయిదువందలమంది బాలికలకూ ధర్మబోధ చేసి వారిని దారిలో పెట్టారు. ఆ మర్నాడు విశాఖ తాతగారైన మేదుడుకూడా బుద్ధుడి బోధలు విని మొదటి సోపానం ఎక్కాడు. రెండు వారాలపాటు మేదుడి ఆతిథ్యం స్వీకరించి బుద్ధుడు తన అనుచరులతో జేతవనానికి తిరిగివెళ్ళాడు.

ఏడెనిమిది సంవత్సరాలు గడిచి పోయాయి. రాజగృహాన్ని పరిపాలించే బింబి సారుడూ, కోసలను పరిపాలించే రాజూ ఒకరికొకరు బావమరుదులు; ఒకరి చెల్లెలిని ఒకరు చేసుకున్నారు. రాజగృహంలో ప్రముఖులైన వర్తకులు చాలా మంది ఉన్నారు, కాని కోసలలో లేరు. అందుచేత కోసల రాజు బింబిసారుడి వద్దకు వెళ్ళి, "మీ నగరంలో వుండే వర్తకులలో ఒకరిని కోసలకు పంపించు!" అని కోరాడు. బింబి సారుడు ధనంజయుణ్ణి పిలిపించి, "నీవు కోసలకు వెళ్ళి అక్కడ నివాసం ఏర్పాటు చేసుకుంటావా ఏమిటి?" అన్నాడు.

"తమ ఆజ్ఞ అయితే వెళతాను," అన్నాడు ధనంజయుడు.

అతను కోసలరాజు వెంట తన పరివార మంతా తీసుకుని బయలుదేరాడు. దారిలో సాయంకాలంవేళకు వారు ఒక విశాలమైన ఖాళీ ప్రదేశాన్ని చేరుకున్నారు. అది నాలుగు దారులు కలిసే చోటు. ధనంజయుడు కోసల రాజుతో, "మహారాజా, నావెంట చాలా పెద్ద సిబ్బంది ఉన్నది. వీరందరికీ మీ నగరంలో చోటు చాలకపోవచ్చు. తమ సెలవైతే మేమిక్కడే ఒక నగరం నిర్మించు కుంటాం," అన్నాడు. కోసలరాజు ఇందుకు సమ్మతించాడు. త్వరలోనే ఆ ప్రదేశాన



సాకేతు అనే మహానగరం నిర్మాణమయింది. దానికి ధనంజయుడు నాయకుడుగా రాజుగారు ప్రకటించాడు.

ఈ సమయంలో శ్రావస్తినగరంలో మిగారుడనే వర్తకుడికి పూర్ణవర్ధనుడనే కుమారుడుండేవాడు. వాడు అందగాడు. "పెళ్ళి చేసుకోరా, బాబూ!" అని తల్లిదండ్రులు కోరితే పూర్ణవర్ధనుడు, "నేను పెళ్ళాడితే పంచకల్యాణి అనిపించుకునే స్త్రీనే పెళ్ళాడతాను," అన్నాడు. పంచకల్యాణి అయిన స్త్రీకి జుట్టు నెమలిపింఛంలాగా ఉండాలి, పెదవులు తాంబూలం వేసుకున్నప్పుడూ వేసుకోనప్పుడూ ఒకే రంగులో ఉండాలి, పలువరస తెల్లగా, ఎగుడుదిగుళ్ళూ, హెచ్చుతగ్గులూ లేకుండా ఉండాలి, శరీరమంతటా ఒకే ఛాయ ఉండాలి, ఎక్కడా మచ్చలుండరాదు, ఎంతమంది పిల్లలను కన్నా నవయవ్వనిలాగే ఉండాలి, ఎంత వయసు వచ్చినా వెంట్రుకలు నెరియరాదు.

పూర్ణవర్ధనుడి మాట కాదనలేక తల్లిదండ్రులు పంచకల్యాణి అయిన కన్యను వెతకటానికిగాను ఎనిమిదిమంది బ్రాహ్మణులను దేశదేశాలకూ పంపారు. వారు అనేక దేశాలు తిరిగి ఒక పర్వదినంనాడు సాకేతునగరానికి వచ్చారు. పర్వదినం





కావటంచేత నగరంలో ఉండే ఉత్తమ స్త్రీలందరినీ వీధిలో చూసే అవకాశం ఉన్నది. అందుచేత ఆ బ్రాహ్మణులు ఒక చావడిలో నిలబడి వీధివెంట వచ్చేపోయే జనాన్ని గమనించసాగారు.

కొద్దిసేపట్లోనే పదిహేనేళ్ల ప్రాయం గల విశాఖ తన చెలికత్తెలతోసహా అటుగా వచ్చింది. ఇంతలో వానజల్లు పడింది. విశాఖ చెలికత్తెలందరూ పరిగెత్తి చావడి చేరుకున్నారు.

విశాఖ తన చెలికత్తెలతోపాటు పరిగెత్తక, వాన లేనట్టుగానే మామూలు మందగమనంతో చావడికేసి వచ్చింది.

"ఈమె దంతాలు ఎలా ఉంటాయో తెలియటంలేదుగాని, కేశకల్యాణం మొదలైన నాలుగు కల్యాణాలూ ఈ పిల్లలో ఉన్నాయి!" అనుకున్నారు బ్రాహ్మణులు. ఆమె దంతాలు చూడాలంటే ఆమెను పలకరించాలి. అందుకని బ్రాహ్మణులు ఆమెతో, "తల్లీ, నిన్ను ఏ అదృష్టహీనుడు చేసుకుంటాడోగాని, నువు ఉదయం నీళ్ల కోసం వెళితే మళ్లీ చీకటిపడ్డదాకా ఇంటికి రావు. నీ భర్త అంతదాకా వస్తే!" అన్నారు.

"ఈ సంగతి మీరెలా చెబుతున్నారు?" అని విశాఖ బ్రాహ్మణులను ప్రశ్నించింది.

"కళ్లతో చూస్తే తెలియటంలేదా, తల్లీ? వానజల్లు ప్రారంభంకాగానే మిగిలిన ఆడపిల్లలందరూ చావడిలోకి వచ్చినాక ఎంతో సేపటికిగాని నువు రాకపోతివి!" అన్నారు బ్రాహ్మణులు.

"ఒళ్లు బద్ధకంచేత నేను పరిగెత్తలేదనుకుంటున్నారులాగుంది. కాని మన పెద్దలు కొందరికి పరుగు నిషేధించారు. కిరీటమూ, రాజలాంఛనాలూ ధరించిన రాజు పరిగెత్తరాదు, అంబారీ వేసిన ఏనుగు పరిగెత్తరాదు, సన్యాసి పరిగెత్తరాదు, స్త్రీ పరిగెత్తరాదు. అందులోనూ అవివాహిత అయిన స్త్రీ అమ్మకపు సరుకులాంటిది. ఆమె

పనిగత్తె పడి చెయ్యో కాలో విరుచుకుంటే ఆమెకు గల వెల తరిగిపోతుంది," అన్నది విశాఖ. ఆమె అన్న మాటలువిని బ్రాహ్మణులు సంతోషించి, ఆమె పూర్ణవర్ధనుడికి తగిన భార్య అవుతుందని నిశ్చయించారు. వారు ఆమెతో తాము వచ్చిన పని చెప్పి ఆమె కొక విలువైన హారం సమర్పించారు. విశాఖ అంతా విని ఆ బ్రాహ్మణులను తన తండ్రి వద్దకు తీసుకుపోయింది. ధనంజయుడు బ్రాహ్మణులతో పెళ్లికొడుకు కుల గోత్రాలడిగి తెలుసుకుని, "అతనికి ఏపాటి ఆస్తి వుంటుంది?" అని అడిగారు.



"అతని వంతు నలభైకోట్లు వస్తుంది," అని బ్రాహ్మణులు చెప్పారు.

"అది మా పిల్ల తలంటికి సరిపోదు. కాని వారు కులగోత్రాలలో మాకు తక్కువ కారు గనక నేను అతనికి నా పిల్ల నిస్తాను!" అన్నాడు ధనంజయుడు.

బ్రాహ్మణులు తిరిగివెళ్లి మిగారుడితో సమాచార మంతా చెప్పారు. మిగారుడు సంతోషించి సాకేతునగరానికి వెళ్లి తన కుమారుడికి పెళ్లి చేయించ నిశ్చయించి ఈ శుభవార్త రాజుగారి చెవినకూడా వేస్తే బాగుంటుందనే ఉద్దేశంతో రాజుగారిని చూడబోయాడు.

రాజుగారు అంతా విని, "చాలాబాగుంది. ధనంజయుడుకూడా మనకు ఆప్తుడే. అతన్ని నేనే యిక్కడికి రప్పించాను. అందుచేత పెళ్ళికి నేనుకూడా సపరివారంగా బయలుదేరి వస్తున్నాను!" అన్నారు. మిగారుడికి గుండెలో రాయిపడ్డట్టయింది.

రాజుగారు తన సిబ్బందితో కదలివస్తే ధనంజయుడు అందరికీ విడిది ఏర్పాట్లూ, భోజన సదుపాయాలూ చెయ్యగలడో లేడో అని మిగారుడు భయపడ్డాడు. ఆయన ధనంజయుడికి సంగతి సందర్భాలన్నీ తెలియజేస్తూ, "ఈ పెళ్లి గుట్టుచప్పుడు కాకుండా చేసినట్టయితే మీకు చాలా



ఖర్చు తప్పుతుందని నా ఉద్దేశం!" అని కబురుచేశాడు.

"పదిమంది రాజులు తమ పరివారాలతో వచ్చినా నేను భయపడేవాణ్ణి కాను!" అని ధనంజయుడు జవాబు పంపాడు. కాని మిగారుడికి ఈ మాటలు పట్టి ప్రగల్భాలుగా తోచాయి. ఈ ధనంజయుడు లేనిపోని గొప్పలకుపోయి, తన గొయ్యి తానే తవ్వుకుంటున్నాడని భయపడ్డాడు.

పెళ్ళివారు సాకేతునగరానికి తరలి వెళ్ళారు. రాజుగారు అంతులేని పరివారాన్ని వెంటబెట్టుకుని వెళ్ళాడు. ధనంజయుడు అందరికీ విడుదులు ఏర్పాటుచేసి భోజనాలు అమర్చారు. ఆయన నగలు చేసే వాళ్లను పిలిచి వాళ్ళకు నౌకర్లచేత డబ్బు మానికల వజ్రాలూ, ఇతర రత్నాలూ, ముత్యాలూ ఇప్పించి, "నా కూతురికి నగలు చేసి ఇవ్వండి," అన్నాడు.

రోజులు గడిచిపోతున్నాయి, పెళ్ళివారు విడుదులలో హాయిగా కూచుని భోజనాలు చేస్తున్నారు, కాని పెళ్ళిముహూర్తం ఎప్పుడో ఎవరికీ తెలియదు. రాజుగారు ధనంజయుణ్ణి పిలిపించి, "మమ్మల్ని ఎంతకాలం భరిస్తావు? త్వరలో ముహూర్తం చూసి, పెళ్ళి చేసి మమ్మల్ని సాగనంపరాదా?" అని సలహా ఇచ్చారు.

"మహారాజా, మంచిముహూర్తం ఇంకా నాలుగుమాసాలదాకా లేదు. మీరు నాకేమీ బరువుకాదు. పెళ్ళి అయినదాకా మీరంతా నా ఆతిథ్యం స్వీకరించాలి. అదే నా ప్రార్థన!" అన్నాడు ధనంజయుడు.

ఆ నాలుగు మాసాలూ ఊరు ఊరంతా పెళ్ళి ఇల్లులాగే వుంది. అతిథులకు ఎటువంటి లోటూ జరగలేదు. వానాకాలం రావటంచేత వంటచెరుకుకు మటుకు ఇబ్బంది అయింది.

అతిథులందరికీ వంటచేయటానికి రోజుకు అయిదువందల బళ్ళ వంటచెరుకు కావాలి.

సేవకులు ధనంజయుడితో, "అయ్యా, వంటచెరుకు దొరకటం చాలా కష్టంగా ఉన్నది," అన్నారు.

"ఏనుగుల శాలలూ, గుర్రాలశాలలూ పడగొట్టి వాటి కలపను వంటచెరుకుగా వాడండి," అన్నాడు ధనంజయుడు.

నాలుగు మాసాలూ గడిచాయి. నగలు చేసేవారు పెళ్ళికూతురి నగలు తయారు చేసి పట్టుకువచ్చారు. పెళ్ళినాడు పెళ్ళికూతురికి రత్నాలతొడుగు తొడిగారు. ఆమె ఒంటిన ఏడుకోట్ల విలువచేసే నగలున్నాయి. (అంత విలవైన నగలు ఆ కాలంలో మరి ఇద్దరు స్త్రీలుమాత్రమే ధరించినట్టు చెబుతారు. వారిలో ఒకతె సుజాత, సిద్ధార్థుడు బుద్ధుడు కాకోయేముందు ఆయనకు పాయసం తీసుకుపోయేటప్పుడామె వాటిని ధరించింది; రెండవ స్త్రీ బంధులుడనే క్షత్రియుడి భార్య. ఈ బంధులుణ్ణి గురించి ముందు ముందు తెలుసుకుంటాం.)

పెళ్ళి ముగిసింది. ధనంజయుడు తన కుమార్తెకు బళ్ళతో బంగారమూ, వెండీ గృహపరికరాలూ భరణం ఇచ్చాడు, ఆమెకు రక్షకులుగా ఎనిమిదిమంది బుద్ధిమంతుల నిచ్చాడు, అనేకవేలమంది దాసదాసీల నిచ్చాడు, లక్ష ఇరవైవేల గోవుల నిచ్చాడు. ఆయన రాజుగారినీ ఇతర పెళ్ళివారినీ సగం దూరం సాగనంపి తిరిగి వెళ్ళిపోయాడు.

మిగారుడికి ఐరావతాన్ని తెచ్చుకున్నట్టయింది. "కోడలితోబాటు ఈ పరివారమంతా కూడా ఏమిటి? వీరందరినీ నే నెలా భరించేది?" అనుకున్నాడాయన.

పెళ్ళికూతురు గృహప్రవేశం చేసే సమయంలో రాజుగారూ ఇతర సామంతులూ విశాఖకు అమూల్యమైన కానుకలూ, కట్నాలూ చదివించారు. వాటన్నిటినీ ఏమి చెయ్యాలో తోచక విశాఖ, ఒకరు పంపిన వాటిని మరొకరికి బహుమానాలుగా పంచేసింది.

—(ఇంకావుంది)






## 10

త్వరలోనే విశాఖకు తన మామగారితో ఘర్షణ వచ్చింది.

మిగారుడు నిఘంటుడనే తీర్థకస్వామి శిష్యుడు. ఒకనాడాయన తన కోడలితో, "పూజకు పోదాం, సిద్ధం కా!" అన్నాడు. విశాఖ ఉత్సాహంతో మంచి దుస్తులు ధరించి, నగలు పెట్టుకుని మామగారివెంట బయలుదేరింది. కాని తాము పూజించబోతున్నది దిగంబరస్వాములనని తెలియగానే ఆమె అసహ్యపడుతూ, "నన్ను ఇలాటి చోటికి తెచ్చారేమిటి?" అన్నది.

తీర్థకులు ఆగ్రహించి, "చూశావా, నీ కొడుకుకు ఎలాటి భార్యను తెచ్చుకున్నావో? ఇది బుద్ధుణ్ణి అనుసరించే పాపి! ఇది నీ కొంపకు నాశనం తెస్తుంది. దీన్ని వెంటనే వెళ్ళగొట్టించు!" అన్నారు.

"అది చిన్నపిల్ల! క్షమించండి!" అన్నాడు మిగారుడు తీర్థకులతో.

మరొకనాడు మిగారుడి ఇంటికి భిక్షపాత్ర పట్టుకుని ఒక అర్హతుడు వచ్చాడు. విశాఖ ఆయనతో, "స్వామీ, ఈ ఇంటి యజమాని ఎంగిలి కూడు తింటాడు. మీరు మరొక ఇంటికి వెళ్ళండి!" అన్నది.

ఈ మాటలు మిగారుడు విన్నాడు. ఆయన కోపించి తన కోడలితో, "నువ్వు నా యింటినుంచి వెళ్ళిపో," అన్నాడు.

"పొమ్మంటే పోవటానికి, రమ్మంటే రావటానికి, నేను మీ దాసీదాన్ని కాను.





నావెంట మా నాన్న ఎనిమిదిమంది రక్షకులను పంపాడు. వారిని పిలిపించండి," అన్నది విశాఖ.

రక్షకులు వచ్చారు. మిగారుడు వారితో, "మా కోడలు నన్నుగురించి చాలా అవమానకరంగా మాట్లాడింది," అన్నాడు.

"మా మామగారు ఎంగిలి కూడు తింటాడని అన్నాను. నా ఉద్దేశం జన్మపరంపరలలో చేసుకున్న కర్మ అనుభవిస్తున్నాడని!" అని విశాఖ వివరించింది. ఈ మాటలు విని మిగారుడు శాంతించి, తృప్తిపడ్డాడు.

"ఇదేనా, లేక నావల్ల ఇంకేమైనా అపచారాలు జరిగాయా?" అని విశాఖ అడిగింది. ఇంకేమీ జరగలేదని మిగారుడు ఒప్పుకున్నాడు.

"సరే, నా దాసదాసీలను పిలిపించండి. నేనీ ఇంట ఉండదలచలేదు, వెళ్లి పోతున్నాను," అన్నది విశాఖ.

"వెళ్లిపోకు. మా ఇంటనే ఉండు!" అని మిగారుడు కోడలిని బతిమాలాడు.

"మీరు నాస్తికులు, నేను బుద్ధుడి శిష్యురాలిని. బుద్ధుడి ఉపదేశాలు వినే హక్కు నాకు ఉన్నట్టయితేనే నేనీ ఇంట ఉంటాను!" అన్నది విశాఖ.

మిగారు డిందుకు ఒప్పుకున్నాడు. ఇది జరిగిన కొద్ది రోజులలోనే విశాఖ బుద్ధుణ్ణీ, ఆయన అనుచరులనూ తమ ఇంటికి భిక్షకు ఆహ్వానించింది. ఈ సంగతి తీర్థకులకు తెలిసింది. మిగారుడు ఒకసారి బుద్ధుడి దర్శనం చేసుకున్నాడంటే ఇక తమకేసి చూడడని వారు భయపడ్డారు. వారు మిగారుడితో, 'బుద్ధుడు మీ ఇంటికి భోజనానికి వచ్చినప్పుడు నీవు ఇంట వుండక ఎక్కడైనా వెళ్లిపో!" అని సలహా ఇచ్చారు.

"నేను మీ సలహా వినను. నా కోడలు విశాఖ చాలా బుద్ధిమంతురాలు. ఆమె సలహాప్రకారమే చేస్తాను," అన్నాడు మిగారుడు.





"నీకు కొంచెంకూడా జ్ఞానం లేదు. ఆ
బుద్ధుడికేసి చూశావంటే నరకానికి పోతావు.
కావలిస్తే వాడి బోధలు విను, కాని వాడు
నీ కళ్ళ పడకుండా కళ్ళకు గంత కట్టుకో!"
అన్నారు తీర్థకులు.

వారి సలహాప్రకారమే మిగారుడు తన
కోడలివెంట బుద్ధుడివద్దకు వెళుతూ కళ్లకు
గంత కట్టుకున్నాడు. కాని బుద్ధుడి మాటలు
వింటూవుంటే కలిగిన ఆనందంతో ఆయన
తన కళ్ళకు అడ్డంగా వున్న గంత లాగి
పారేసి, బుద్ధుడి దివ్యమైన రూపాన్ని
చూశాడు. ఆయన విశాఖకేసి తిరిగి,
"అమ్మా, ఇకనుంచి నీవు నన్ను నీ కొడుకు
లాగా చూసుకుని నన్ను కాపాడుతూ
వుండు!" అన్నాడు. ఆయన బుద్ధుణ్ణి సమీ
పించి, "స్వామీ, నాకిక మీరే దిక్కు.
నాకున్న నలబై కోట్లూ మీకే కైంకర్యం
చేస్తాను. బుద్ధుడికి సమర్పించినది ఏదీ
వ్యర్థం కాదు. ఈనాడు నాకు సుదినం!"
అన్నాడు. అది మొదలు మిగారుడి ఇంట
బౌద్ధులకు తప్ప మరే మతంవారికీ స్థానం
లేకుండా పోయింది. మిగారుడి బుద్ధిని
మార్చటంవల్ల విశాఖను అందరూ "మిగార
మాత" అని పిలిచారు. బుద్ధుడి వెంటవుండే
శిష్యురాళ్ల కందరికీ విశాఖ పెద్ద అయింది.




విశాఖ రోజుకు మూడుసార్లు విహారానికి
వెళ్లి వచ్చేది. ఉదయంపూట భోజనాలు
తీసుకుపోయేది, సాయంకాలంపూట పూలూ,
దీపాలూ తీసుకుపోయేది. బుద్ధుడు స్త్రీలకు
వరాలివ్వరాదనే నియమం గలవాడు. అయి
నప్పటికీ, బౌద్ధమతాభివృద్ధికోసమని ఆయన
విశాఖ కోరికలను ఆమోదించాడు. ఆమె
ఆయనను ఎనిమిది వరాలు కోరింది.
వాటిలో బుద్ధుడివద్దకు కొత్తగా వచ్చేవారిని
ఆమె ఇంటికి పంపటమూ, ఆమె జీవితాంతం
వరకూ ప్రతిరోజూ అయిదువందలమంది
బౌద్ధ సన్యాసులు ఆమె ఇంట భోజనం
చెయ్యటమూ, జబ్బుపడినవారు ఆమెవల్ల





సహాయం పొందటమూ, ఏటా అయిదు వందలమంది సన్యాసులు ఆమెనుంచి తమకు కావలిసిన వస్త్రాలూ, పరికరాలూ స్వీకరించటమూ మొదలైనవి ఉన్నాయి.

విశాఖ ఇరవైఏళ్లకాలంలో ఇరవైమంది పిల్లలను కన్నది. వారిలో పదిమంది కొడుకులు, పదిమంది కూతుళ్లు. ఇంతమంది పిల్లలను కన్నప్పటికీ ఆమె శరీరం చాలా దృఢంగా ఉండేది. ఆమెకు అయిదు ఏనుగుల బలం ఉన్నదని విని శ్రావస్తి రాజు నమ్మలేకపోయాడు. ఒక సమయంలో ఆమెకు ఎదురువస్తూ ఆయన తన ఏనుగును ఆమెపైకి నడిపించాడట. ఆమె ఒక



చేతితో ఆ ఏనుగు తొండాన్ని పట్టుకుని నొక్కేసరికి, అది బాధతో ఘీంకరించిందట.

కొంతకాలం గడిచాక విశాఖ తనకు తండ్రి పెట్టిన నగలన్నిటినీ అమ్మేసి ఆ సొమ్ముతో బౌద్ధవిహారం ఒకటి కట్టాలని నిశ్చయించింది. కాని ఆ నగలను కొనగలిగిన ధనికుడు శ్రావస్తిలో లేకపోయాడు. అయినప్పటికీ ఆమె నగరానికి తూర్పువేపున వున్న ఒకతోట కొని, ఎంతో డబ్బు వెచ్చించి అక్కడ ఒక విహారం నిర్మించింది. తూర్పుగా వుండటంచేత దానికి పూర్వారామ మన్నపేరు వచ్చింది. విశాఖ ఈ విహారాన్ని బుద్ధుడిపరం చేసిననాడు బుద్ధుడు, "విశాఖకు గల సంపదా, బలమూ, సౌభాగ్యమూ ఆమె పూర్వజన్మలలో చేసుకున్న సత్కర్మల ఫలితంగా కలిగాయి!" అని చెప్పాడు.

• • •

శుద్ధోదనుడికి అమితోదనుడని ఒక తమ్ముడున్నాడు. ఆయనకు మహానముడూ, అనురుద్ధుడూ అని ఇద్దరు కొడుకులూ, రోహిణి అని ఒక కూతురూ ఉన్నారు. అనురుద్ధుడు బొత్తిగా ప్రపంచజ్ఞానం లేనివాడు.

వాడు ఏడేళ్లవాడై ఉండగా ఒకనాడు మరి ఇద్దరు రాజకుమారులతో ఏదో ఆట ఆడాడు. ఆ ఆటలో ఓడినవారు మిగిలిన





వారికి బియ్యపు రొట్టె పెట్టాలి. మొదటి ఆటలో అనురుద్ధుడు ఓడిపోయాడు. వాడు తన తల్లికి కబురుచేసి బియ్యపు రొట్టె తెప్పించి గెలిచిన ఇద్దరికీ పెట్టాడు. మళ్ళీ ఆడారు, మళ్ళీ అనురుద్ధుడు ఓడిపోయాడు. ఈవిధంగా అతను మూడుసార్లు ఓడి తల్లి వద్దనుంచి మూడు రొట్టెలూ తెప్పించాడు. తన కొడుకు నాలుగోసారికూడా ఆటలో ఓడి రొట్టెకోసం కబురు చేసినప్పుడు, తల్లి "ఇక లేదు," అని చెప్పమని నౌకరుతో చెప్పి, ఆ మాట వాడికి అర్థం కాగలందులకు ఒక ఖాళీగిన్నె ఇచ్చి పంపింది.

ఈ గిన్నెలోకి ఎలా వచ్చిందో ఒక రొట్టె వచ్చింది. దాన్ని అందులో ఎవరు పెట్టారో మనకు తెలియదు. నౌకరు ఆ గిన్నెను అనురుద్ధుడికిస్తూ, "ఇక లేదు," అని చెప్పాడు. అనురుద్ధుడు గిన్నె మూత తీసి అందులో ఒక కొత్తరకం రొట్టె ఉండటం గమనించాడు. ప్రపంచజ్ఞానం లేనివాడు కావటంచేత ఆ రొట్టె పేరు "ఇక లేదు" కాబోలు అనుకున్నాడు. తింటే ఆ రొట్టె బియ్యపు రొట్టెలకన్న ఎంతో రుచిగా ఉన్నది.

అనురుద్ధుడు తల్లివద్దకు పోయి, "'ఇక లేదు' రొట్టెలు నాకిదివరకెన్నడూ పెట్టావు కావేమమ్మా!" అని మారాంచేశాడు. తల్లి ఆశ్చర్యపడి జరిగిన విషయం తెలుసుకుని నిర్ఘాంతపోయింది. అనురుద్ధుడికి ప్రపంచ జ్ఞానం లేకపోవటానికి ఇది ఒక ఉదాహరణ. అతను ఇలాగే పెరిగి పెద్దవాడయాడు.

అనురుద్ధుడితోబాటు అతని అనుచరులు కూడా దాదాపు ఈవిధంగానే పెరిగినట్టు కనిపిస్తుంది. అతను పదిహేనేళ్ళవాడై ఉండగా అతనూ, భద్రుడూ, కింబిలుడూ చర్చలో పడ్డారు: బియ్యం ఎందులోనుంచి వస్తుంది?

"గిన్నెలోనుంచి వస్తుంది," అన్నాడు కింబిలుడు, వాడి ఉద్దేశం బియ్యాన్ని కడిగే గిన్నె అని.







"కాదు, తప్పేలాలోనుంచి వస్తుంది," అన్నాడు భద్రి. తప్పేలా బియ్యం వండేది.

"కానేకాదు, అది బంగారు పళ్లెంలో నుంచి వస్తుంది!" అన్నాడు అనురుద్ధుడు. వాడు చెప్పిన పళ్లెం అన్నం వడ్డించటానికి ఉపయోగించేది.

అనురుద్ధుడు ఇలా ప్రపంచజ్ఞాన శూన్యుడై ఉన్న స్థితిలో బుద్ధుడు, ప్రతి శాక్యకుటుంబంనుంచి ఒక్కొక్కళ్లో తన వద్దకు పంపవలసిందని కబురు చేశాడు.

అమితోదనుడి కుటుంబంలోనుంచి మహనముడైనా వెళ్లాలి, అనురుద్ధుడైనా వెళ్లాలి. మహనముడికి సన్యాసి కావాలని ఏమాత్రమూ లేదు, రాజరికం అనుభవించాలని ఉన్నది. అదీగాక అనురుద్ధుడులాటి జ్ఞానహీనుడు రాచకార్యాలకు పనికిరాడు. అందుచేత మహనముడు అనురుద్ధుణ్ణి సన్యాసి కావటానికి పురికొల్పాడు. "బియ్యం ఎందులోనుంచి వస్తుంది?" అన్న చర్చ అతనికి ఈ అవకాశాన్ని ఇచ్చింది.

మహనముడు అనురుద్ధుడితో, "బియ్యం ఎలా వస్తుందోకూడా నీకు తెలిదా? రైతులు పొలందున్ని పండిస్తారు. వ్యవసాయం చెయ్యటానికి నాగళ్లూ, పలుగులూ, పారలూ, చేటలూ, కొడవళ్లూ మొదలైనవి పద్దెనిమిది రకాల పనిముట్లు కావాలి. పొలాలకి కాలవలు కట్టాలి, గట్లువెయ్యాలి, ఎరువు తోలాలి, నారుమడి వెయ్యాలి, నాటాలి, కలుపు తియ్యాలి. పైరును ఎలుకలూ, పందులూ, పశువులూ నాశనం చెయ్యకుండా అహోరాత్రాలు కాపాడాలి. మంచెమీద కూచుని పిట్టలనూ, చిలకలనూ తోలుతూండాలి. ఇది తొమ్మిది మాసాల పని. పంట నూర్చినాక కూలీలకూ, మంగళ్లకూ, చాకళ్లకూ, బిచ్చగాళ్లకూ ఇవ్వగా మిగిలినదానిలోనుంచి పాతబాకీలు తీర్చి, విత్తనాలకు కొంత ఉంచుకుని మిగిలినది తినాలి. దాన్ని మళ్లీ పై పంటదాకా పొదుపుగా వాడుకో





వాలి," అన్నాడు. ఈ మాటలకు ఆశ్చర్యపోతూ, "అబ్బో, బియ్యం రావటానికి ఇంత శ్రమ ఉన్నదా?" అన్నాడు అనురుద్ధుడు.

"ఇంతేనా? అనుకోకుండా కూలీలు ఇబ్బందిపెడతారు. తరుణం దాటిపోతే పంట పాడవుతుంది. వ్యవసాయం చేసేవాడికి ఏ విధమైన సుఖమూ లేదనుకో. అందుకే, తమ్ముడూ, నాకీ వ్యవసాయం వద్దు. నేను హాయిగా బుద్ధుడిదగ్గిరికి వెళ్లి సన్యాసం పుచ్చుకుందామనుకుంటున్నాను!" అన్నాడు మహానముడు.



"అన్నా, నీకు కనీసం ఈ వ్యవసాయం గొడవ తెలియునన్నా తెలుసు. నాకు బొత్తిగా ఏమీ తెలియదు. నన్ను బుద్ధుడి దగ్గిరికి వెళ్లనీ. నువ్వు చక్కగా పొలాలు చూసుకో!" అని ప్రాధేయపడ్డాడు అనురుద్ధుడు. అదే మహానముడికి కావలిసిందికూడా.

తన అన్నతో మాట్లాడిన తరవాత అనురుద్ధుడు తన తల్లివద్దకుపోయి, "అమ్మా, నేను బుద్ధుడిదగ్గిరికి వెళ్లిపోతాను. అనుమతి ఇయ్యి!" అని అడిగాడు.

"మీ నాయన పోయాడు. ఇప్పుడు నాకు నువ్వూ, మీ అన్నా రెండు కళ్లవంటివాళ్లు. మీలో ఎవరు వెళ్లిపోయినా, గుడ్డిదాన్నయిపోతాను!" అన్నది తల్లి.

కాని అనురుద్ధుడు ఆమెను మళ్లీమళ్లీ అనుమతి అడిగాడు. అనుమతి పూర్తిగా నిరాకరిస్తే తన కొడుకు మనసు కలించి పోతుందనుకుని తల్లి, "నాయనా, నువ్వింతగా అడుగుతుంటే నేనుమాత్రం ఏంచెయ్యగలను? భద్రి బుద్ధుని శిష్యుడు అయే పక్షంలో నువ్వుకూడా వెళ్లు," అన్నది.

భద్రి అప్పటికే రాజరికంలో ప్రవేశించి రాచకార్యాలు నిర్వహిస్తున్నాడు, అలాటివాడు ఎన్నటికీ సన్యాసం పుచ్చుకోడని అనురుద్ధుడి తల్లి ఉద్దేశం.

అనురుద్ధుడు ఉపాయంచేత భద్రిని సన్యాసానికి ఒప్పించాలని నిశ్చయించాడు.



కార్యాలు ఆడితప్పరు. అందుచేత భద్రిచేత ఏదోవిధంగా సన్యాసానికి ఒప్పిస్తే తరవాత అతను ప్రాణమైనా విడుస్తాడుగాని అన్న మాట తప్పడు.

అనురుద్ధుడు భద్రివద్దకు వెళ్ళి అతన్ని ఆలింగనం చేసుకుని, "నేను నిన్ను ఇంతగా ప్రేమిస్తున్నాను గదా. నేను ఎప్పటికైనా సన్యాసం పుచ్చుకుంటే నాకు తోడుగా ఉండటానికి నువుకూడా సన్యాసం పుచ్చుకుంటావా?" అన్నాడు.

అప్పటికే అనురుద్ధుడు సన్యసించ నిశ్చయించాడని భద్రి కలలోకూడా ఊహించ లేదు. అతను నిర్లక్ష్యంగా, "నువు పుచ్చుకున్న మరుక్షణం నేనుకూడా సన్యాసం పుచ్చుకుంటాను!" అన్నాడు.

అనురుద్ధుడు ఆనందంతో పొంగిపోతూ, "నేనివాళే సన్యాసం పుచ్చుకోబోతున్నాను. నువుకూడా బయలుదేరి నావెంట రా!" అన్నాడు. భద్రి నిర్ఘాంతపోయాడు.

"ఒరే, మనం ఇంకా కుర్రవాళ్ళం. అనుభవించవలసిన సుఖాలు చాలా ఉన్నాయి. సన్యాసానికేం తొందర? ముసలి వాళ్ళమయాక అలాగే సన్యాసం పుచ్చుకుందాంలే!" అన్నాడతను.

"ముసలితనం తరవాతనే చావు వస్తుందని ఎక్కడైనా ఉందా ఏమిటి? అందరూ ముసలివాళ్ళయే చస్తున్నారా? సన్యాసాన్ని ముసలితనంతో ముడిపెట్టటం వివేకంకాదు. సిద్ధార్థుడు ఇరవైతొమ్మిదో ఏటనే సన్యసించాడు. ఎందరో క్షత్రియులు యౌవనంలోనే సన్యాసం పుచ్చుకున్నారు. అందుచేత నా వెంట వచ్చెయ్యి," అన్నాడు అనురుద్ధుడు.

"అయితే నాకు ఏడేళ్ళు గడువియ్యి, తరవాత మనం సన్యాసం పుచ్చుకుందాం!" అన్నాడు భద్రి. కాని అనురుద్ధుడు ఒప్పుకో లేదు. భద్రి గిల్లిగిల్లి బేరం చెయ్యగా అతను ఏడు రోజులు వ్యవధి మాత్రం ఇవ్వటానికి ఒప్పుకున్నాడు. —(ఇంకా ఉంది)





# అహింసాజ్యోతి

[ 11 ]

వారం గడిచింది. భద్రి, అనురుద్ధుడూ, శుద్ధోదనుడి మరొక తమ్ముడి కొడుకు ఆనందుడూ, కింబిలుడూ, సుప్రబుద్ధుడి కుమారుడు (యశోధర అన్న) దేవదత్తుడూ, భగుడూ అనే శాక్యరాజకుమారులు వినోదం నెపంమీద బయలుదేరి పదహారు మైళ్ళ దూరానఉండే ఒక చోటికి వెళ్ళారు. అక్కడ వారు తమ పరివారాన్ని ఉంచి, ఉపాలి అనే మంగలినిమాత్రం వెంటబెట్టుకుని మరొక చోటికి వెళ్ళారు. అక్కడ వారు తమ ఆభరణాలన్నిటినీ తీసి ఉపాలికిచ్చి, తాము సన్న్యసించబోతున్నట్టు వాడితో చెప్పారు. ఇది వింటూనే ఉపాలి తనలో, "నేను ఆభరణాలన్నీ తీసుకుని కపిలవస్తుకు తిరిగి పోయానంటే శాక్యులు నన్ను ప్రాణాలతో వదలరు. ఈ అబ్బాయిలు అన్నీ సుఖాలూ వదిలేసి సన్యాసం తీసుకుంటుంటే నేనుమాత్రం ఎందుకు సన్యసించరాదు?" అనుకున్నాడు. వాడు ఆ నగలన్నిటినీ ఒక చెట్టుకొమ్మకు తగిలించి వారి వెనకనే బయలుదేరాడు. వాడుకూడా తమతోపాటు సన్యాసం పుచ్చుకోవటానికి నిశ్చయించాడని తెలిసాక శాక్య రాజకుమారులు వాణ్ణికూడా తమవెంట తీసుకుపోయారు.

ఆ సమయానికి బుద్ధుడు అనుప్రియ అనే గ్రామంలో ఉంటున్నాడు. శాక్య రాజకుమా



మలు ఆయనవద్దకు వెళ్ళి, "మాకు అహంకారం ఉగ్గుపాలతో పెట్టినది. మా రాజసాన్ని చంపటానికి ఒక ఉపాయం ఉన్నది. ముందుగా ఈ మంగలికి సన్యాసం ఇప్పించినట్టయితే మేము వాడికి వందనం చెయ్యవలసివస్తుంది. దానితో మా రాజసం చచ్చి ఊరుకుంటుంది. ఆ తరవాత మళ్ళీ మాలో రాజ్యలోభం తలఎత్తదు!" అన్నారు.

బుద్ధుడు దీనికి ఆమోదించి ముందుగా మంగలి ఉపాలికి సన్యాసం ఇప్పించి, తరవాత రాజకుమారులకు ఇచ్చాడు.

ఇది జరిగేనాటికి బుద్ధుడు యాభైయయి ఏళ్ళవాడు. అప్పటికాయన బుద్ధుడై ఇరవై సంవత్సరాలయింది. కాని ఆయనకు సపర్యలు చెయ్యటానికి నియమంగా ఒకరు ఉండటం జరగలేదు. తనవెంట ఎప్పుడూ ఒకేమనిషి ఉండటం సౌకర్యంగా ఉంటుందని ఆయన తన శిష్యులతో అన్నాడు. అనేకమంది అర్హతులు ముందుకు వచ్చారుగాని బుద్ధుడు అందుకు ఒప్పుకోలేదు.

ఆనందుడు బుద్ధుడికి సపర్యలు చేయటానికి ఒప్పుకున్నాడు. కాని అతను కొన్ని షరతులు పెట్టాడు. అవి ఏమిటంటే: బుద్ధుడు విడిచిన వస్త్రాలు తనను ధరించమనరాదు; బుద్ధుడి భిక్షాపాత్రలోని ఆహారాన్ని తనను తినమనరాదు; ఆయనను ఎవరైనా భిక్షకు పిలిస్తే తాను వెళ్ళవలసి రాగూడదు; తాను భిక్షఎత్తిన ఆహారాన్ని బుద్ధుడు భుజించాలి; ఎవరైనా బుద్ధుడితో మాట్లాడవలసివస్తే తనద్వారా మాట్లాడాలి; తనకు ఎప్పుడు ఏవిషయంలో ఏసందేహం వచ్చినా బుద్ధుడు వెంటనే ఆసందేహాన్ని తీర్చాలి; తను లేని సమయంలో బుద్ధుడు ఏదైనా ప్రసంగం చేస్తే, తాను వచ్చినాక ఆయన ఆ ప్రసంగమంతా తనకోసం మళ్ళీచెయ్యాలి.

ఈ నియమాలన్నిటికి బుద్ధుడు ఒప్పుకున్నాడు. అది మొదలు ఆనందుడు బుద్ధుడి పరిచారకుడయాడు. ఆనందుడు బుద్ధుడికి



చేసిన సేవ ఆదర్శప్రాయమైనది. బుద్ధుడు ఆనందుణ్ణి ఎప్పుడు పిలిచినా అతను హాజరులో ఉండేవాడట. ఎన్నడూ బుద్ధుడు ఆనందుడి కోసం రెండవసారి పిలవవలసి రాలేదని చెబుతారు.

• • •

ఒక సందర్భంలో బుద్ధుడు ధర్మబోధ చేస్తూ, వినాశనం ప్రతిదానికీ వచ్చి తీరుతుందని చెప్పటానికి దృష్టాంతంగా, అత్యున్నత దశలో విశాలానగరంకూడా ఒకనాడు పీడలకూ, క్షామానికీ, పిశాచాలకూ ఎర అవుతుందని అన్నారు. ఆయన అమోఘ వచనం అక్షరాలా నిజమయింది. మొదట నగరమంతటా అంటువ్యాధులు చెలరేగాయి, వాటి వెనకనే క్షామం ఏర్పడింది. నగరం పీనుగు పెంటల మయమయింది. చచ్చినవారికి దహనం చేసేవాడుకూడా లేకపోయినారు.

ప్రజలు వెళ్ళి తమ రాజుగారితో మొర పెట్టుకున్నారు. "మాకీ కష్టాలు సంభవించటంలో నావల్ల దోషం ఏమైనా ఉన్నదా?" అని రాజు అడిగారు. అలాటి దేమీ లేదన్నారు ప్రజలు. అయితే ఏంచెయ్యాలన్నారు రాజు. మహాత్ముల సహాయంతో ఈ బాధలన్నీ నివారణ అవుతాయని కొందరన్నారు. మరి కొందరు బుద్ధుడి శరణు జొచ్చినట్టయితే అన్ని కష్టాలూ గట్టెక్కుతాయన్నారు. ఈ సలహాప్రకారం బుద్ధుణ్ణి విశాలానగరానికి ఆహ్వానించటానికై కొందరు రాజకుమారులు బయలుదేరి వెళ్ళారు. ఆ సమయాన బుద్ధుడు వేళువన విహారంలో ఉంటున్నారు. అందుచేత రాజకుమారులు బింబిసార మహారాజును కలుసుకుని ఆయనకు తాము వచ్చిన పని చెప్పారు.

"బుద్ధుడికి ఎక్కువ తక్కువలు లేవు. ఆయన అందరిపట్లా సమానమైన దయగలవాడు. మీరు స్వయంగా వెళ్ళి ఆయనతో మీ కోరిక చెప్పుకోండి!" అని బింబిసారుడు వారికి సలహా ఇచ్చాడు. రాజకుమారులు

బుద్ధుడివద్దకు వెళ్ళి ఆయనను తమ విశాలా నగరానికి ఆహ్వానించారు. బుద్ధుడు వెంటనే సమ్మతించారు.

ఈ సంగతి తనకు తెలియగానే బింబిసార మహారాజు బుద్ధుడికోసం రాజగృహం నుంచి గంగానది ఒడ్డువరకూ 80 మైళ్ళ పొడుగున దారి వేయించారు. అదే సమయంలో విశాలానగరవాసులైన లిచ్ఛవులు గంగ అవతలి ఒడ్డునుంచి తమ నగరానికి 48 మైళ్ళ పొడవున దారి వేశారు.

అంతకు మునుపు ఎంతో కాలంగా లేని వాన బుద్ధుడు ప్రయాణం కాగానే కురవసాగింది. గంగాతీరందాకా బింబిసార మహారాజు బుద్ధుడివెంట వెళ్ళి అక్కడఆగిపోయి, బుద్ధుడి రాకకు ఎదురుచూడ సాగారు. బుద్ధుడు నది దాటి విశాలానగరానికి వెళ్ళాడు.

ఆయన నగరం ప్రవేశిస్తూనే ఆనందుడితో, "నువ్వు భిక్షాపాత్రనిండా నీరు పోసుకుని నగరమంతటా చల్లి రా!" అన్నారు. ఆనందుడు అలాగే చేశాడు. దీని ఫలితంగా రోగులు ఆరోగ్యవంతులయారు. అనేక మంది పౌరులు ఆనందుడి వెంటపడి తిరుగుతూ బుద్ధుడి మహిమను ప్రశంసించారు.

బుద్ధుడు రాజభవనానికి వెళ్ళి అక్కడ చేరినవారికి రతన సూత్రం ఉపదేశించారు. అశేషమైన జనం ఆయనకు శిష్యులైపో



యారు. ఆయన విశాలానగరంలో కొన్ని దినాలుండి తిరుగుప్రయాణమై వచ్చేటప్పుడు నాగులు కొంద రాయనను తమ ఇంటికి ఆహ్వానించారు. ఆయన వారి ఇంట ఒక రాత్రి ఉండి, మర్నాడు గంగ దాటి, బింబిసార మహారాజును కలుసుకుని రాజగృహానికి తిరిగి వచ్చేశారు.

విశాలానగరంలో అంబపాలి అనే ప్రసిద్ధ రాజనర్తకి ఉన్నదనీ, ఆమె మూలాన విశాలానగరపు ఖ్యాతి దేశదేశాలా విస్తరించిందని బింబిసార మహారాజుకు తెలియవచ్చింది. తన రాజధాని అయిన రాజగృహంలో రాజనర్తకి లేకపోవటంచేతనే ఆ నగరానికి విశాలానగరానికి ఉన్న ఖ్యాతి లేకపోయిందని విచారం కలిగి బింబిసారుడు తానుకూడా లిచ్ఛవులలాగే ఒక గొప్ప అందగత్తెను రాజనర్తకిగా నియమించుదా మనుకున్నాడు.

తన నగరంలోనూ, పరిసరాలలోనూ ఉండే అందగత్తెలయిన రాజకుమార్తెలందరూ రావాలని ఆయన ఒక ప్రకటన చేశారు. అలా వచ్చినవారందరిలోకీ సాలావతి అనే రాజకుమార్తె అందరికన్నా చక్కనిదిగా ఎన్నుకోబడింది. బింబిసార మహారాజు ఆమెను రాజనర్తకిని చేసి ఆమె నిమిత్తమై తన రాజ్యంపైన 2 లక్షల మనురజాలు సుంకం విధించారు. ఆ మొత్తానికి





తాను మరొక లక్ష మణిరత్నాలు జతచేర్చి సాలావతికి కానుకగా ఇచ్చాడు. ఆమె మూలాన రాజగృహానికికూడా కీర్తి వచ్చింది.

రాజుగారి కుమారుడైన అభయుడనే వాడు ఈ రాజనర్తకిని ప్రేమించాడు. కొంత కాలానికి సాలావతి గర్భవతి అయింది. రాజ నర్తకులు తాము గర్భవతులుగా ఉన్నట్టు ఎవరికీ తెలియనివ్వరు. తాము కనే బిడ్డ ఆడ శిశువైతే రహస్యంగా సాకి పెద్దదాన్ని చేస్తారు, మగపిల్లవాడు పుట్టినట్టయితే అడవిపాలు చేసేస్తారు.

ఈ సంప్రదాయాన్ని అనుసరించి సాలావతి తన గర్భంగురించి కనీసం అభయుడికైనా తెలియనివ్వక, తన ఆరోగ్యం బాగులేదని సాకుపెట్టి, ఇల్లు కదలకుండా ఉండిపోయింది. నెలలు నిండాక ఆమెకొక మగ శిశువు కలిగాడు. ఆ శిశువును ఆచార ప్రకారం అడవులలో వదిలిరమ్మని తన నౌకర్లతో చెప్పి, సాలావతి స్నానంచేసి మామూలుగా అందరి ఎదటికి రాసాగింది.

ఏ పాపమూ ఎరగని ఆ పసికందును నౌకర్లు నట్టడవిలో ఒక గోతిలో పడేసి వెళ్ళిపోయారు. ఆరోజునే బింబిసారుడి కొడుకైన అభయుడు ఆ అరణ్యంలోకి తన పరివారంతో సహా విహరించబోయారు. ఒకచోట చాలా కాకులు పలయంగా కూచుని ఉండటం అభయుడికి కనిపించింది. ఆ కాకులు ఏదో ఆహారంచుట్టూ కూచున్నాయనుకుని అభయుడు అదేమిటో చూసి రావటానికి తన నౌకర్లను పంపాడు. వారు చూసివచ్చి ఒక గోతిలో ఒక మగశిశువున్నదనీ, అది ఇంకా ప్రాణాలతో ఉన్నదనీ, కాకులు దానిని పొడవక రక్షించేవాటిలాగ చుట్టూ చేరాయనీ చెప్పారు.

అనాథ శిశువన్న దయవల్లనో, కానె తండ్రి అయిన కారణంగా తనలో కలిగిన సహజ వాత్సల్యంచేతనోగాని అభయుడికి ఆ శిశువుపై అనురాగం కలిగింది. అతను

శిష్యుడుగా చేర్చుకున్నట్టయితే మీకు సేవ చేసి ఋణం తీర్చుకుంటాను!" అన్నాడు జీవకుడు.

ఆ గురువు తన శిష్యులవద్ద సాధారణంగా వెయ్యి వరహాలు గురుదక్షిణ పుచ్చుకుంటాడు. అయినప్పటికీ ఆయనకు జీవకుణ్ణి చూస్తే వాడు విద్యాదానం చేయదగినవాడని అనిపించింది. అందుచేత ఆయన అతన్ని తన శిష్యుడుగా చేసుకుని వైద్యవిద్య చెప్పనారంభించాడు. ఇంకొకరయితే పదహారేళ్ళలోకూడా తెలుసుకోలేని వైద్య రహస్యాలన్నిటినీ జీవకుడు ఏడు సంవత్సరాల కాలంలో నేర్చుకున్నాడు.

ఒకనాడు జీవకుడు తన గురువుతో, "స్వామీ, నేను విద్య మీదగ్గిర ఇంకా ఎంత కాలం నేర్చుకోవాలి?" అని అడిగాడు.

గురువు అతనితో, "నీవు నాలుగురోజులు సెలవు తీసుకుని నగరద్వారం వెలపల పదహారుమైళ్ళ దూరంలో ఉండే స్థలమంతా శ్రద్ధగా పరికించు. అక్కడ నీకు కనిపించే చెట్లచేమలలో వైద్యానికి పనికిరానివిగా కనబడిన వేళ్ళనూ, పువ్వులనూ, బెరడునూ, కాయలనూ పట్టుకురా. ఆ తరవాత, నీ చదువు ఎప్పుడు పూర్తి అవుతుందో నేను చెబుతాను," అన్నాడు.

జీవకుడు అలాగే నాలుగురోజులపాటు తిరిగి చివరకు ఉత్త చేతులతో గురువు వద్దకు వచ్చి, "స్వామీ, వైద్యానికి పనికిరాని ఒక్క వేరుగాని, పువ్వుగాని, బెరడుగాని, కాయగాని నాకు ఎంత వెతికినా కనిపించలేదు," అన్నాడు.

"నాయనా, నీ చదువు ముగిసింది. నీకింత చెప్పగల గురువు ఎవరూ లేదు!" అన్నాడు గురువు జీవకుడితో.

తరవాత ఆయన జీవకుడికి మూడు నాలుగు రోజులకు సరిపోయే గ్రాసం ఇచ్చి, వెంట మనుషులను పంపి అతణ్ణి ఇంటిదాకా సాగనంపించాడు. —(ఇంకా ఉంది)





# అహింసాజ్యోతి

## 12

ఇంటికి తిరిగి వస్తూ దారిలో జీవకుడు సాకేతునగరం చేరి అక్కడ కొంతకాలం విశ్రాంతి తీసుకున్నాడు. ఆ నగరంలో ఒక ప్రముఖుడి భార్య ఏడేళ్లుగా తీరని శిరోవేదనతో బాధ పడుతున్నది. ఎందరో వైద్యులు ఆమె బాధ నివారణ చేస్తామని నమ్మించి, ఎన్నో చికిత్సలు చేసి, ఎంతో డబ్బు గుంజారు. కాని వ్యాధిమాత్రం తగ్గలేదు.

జీవకుడికి ఈ వృత్తాంత మంతా తెలిసి, ఆ స్త్రీ ఉండే ఇంటికి వెళ్ళి, ఆమెకు చికిత్స చేయగలనని కబురుచేశాడు. అతడి వయసు గురించి తెలియగానే ఆమె, "కొమ్ములు తిరిగిన వైద్యులు కుదర్చలేని జబ్బును ఈ పసివాడు కుదుర్చుతాడా? అతను స్వయం పాకమే కోరతాడా, మరేదైనా కోరతాడో ఇచ్చి పంపెయ్యండి!" అన్నది.

ఈ మాటలు విని జీవకుడు, "జ్ఞానానికి బాల్యమేమిటి, వార్ధక్యమేమిటి? ముసలివారందరూ తెలిసినవారౌతారా? ఆ ఇల్లాలికి నా చికిత్స ప్రధానంగాని, నా వయసుతో ఏం పని? ఆమె శిరోవేదన నయం చేసిగాని నేను వెళ్ళను. నా చికిత్స ఫలించకపోతే ఆమెకు కలిగే నష్టం ఏమీలేదు. ఎందుకంటే ఆమె వ్యాధి నయమైనాకగాని నేను ప్రతిఫలం పుచ్చుకోను," అని మళ్ళీ కబురు చేశాడు. ఈ మాటలు విని ఆ ఇల్లాలు ముచ్చటపడి జీవకుడికి కబురుపెట్టింది. అతను వచ్చాక ఆమె అతన్ని కూచోమని,




"బాబూ, ఏడేళ్ళుగా నిద్రపోయి ఎరగను. కనీసం ఒక్కరోజుపాటు నాకు తలబాధ లేకుండా చేయగలవా?" అన్నది.

"అమ్మా, మీ బాధను ఒక్క క్షణంలో పోగొడతాను. కొంచెం వెన్న కరగబెట్టండి," అన్నాడు జీవకుడు. కరిగించిన వెన్నలో ఏదో ఔషధం వేసి అతను దాన్ని ఆమె ముక్కులో పోశాడు. ఆ ఔషధంలో కొంత మెదడులోకి, మరికొంత గొంతులోకి వెళ్ళింది. గొంతులోకి వెళ్ళిన ఔషధాన్ని ఆమె బయటికి ఉమిసింది. వెంటనే ఆమె భర్త తన నౌకర్లతో, "ఆ మందును గుడ్డలోకి ఎత్తండి!" అన్నాడు.



"కింద పడిన మందునుకూడా తిని శుభ్రంచేసే ఈ పిసినిగొట్టులు, నాకేమి ప్రతిఫలం ఇస్తారు?" అని జీవకుడు తనలో అనుకున్నాడు.

అతను మనసులో అనుకున్న మాట గ్రహించి ఆ ఇల్లాలు, "బాబూ, మరొక విధంగా భావించకు. ఆ మందును శుభ్రం చెయ్యమన్నది లోభంచేత కాదు. నీ మందుపై మాకు గల గౌరవంకొద్దీ అలా చేశాం. అది నిజంగా వెలలేని మందు. నా తలపోటు అప్పుడే పోయింది!" అన్నది.

ఈ మాట విని చుట్టూ చేరిన బంధువులూ, నౌకర్లూ పొందిన ఆనందానికి మేర లేదు. ఆ ఇల్లాలూ, ఆమె భర్తా, ఆమె కొడుకూ, బంధువులూ తలకొక నాలుగువేల సిలకర్షల చొప్పున జీవకుడికి బహుమతి ఇచ్చారు. అంతులేని రథాలూ, ఇతర బహుమానాలూ ఇచ్చారు.

వీటన్నిటినీ తీసుకుని జీవకుడు రాజగృహానికి వెళ్ళి, అభయుడితో, "నన్ను మీరు కష్టపడి పెంచి పెద్దచేసినందుకు ప్రతిఫలంగా ఇవన్నీ తీసుకోండి!" అంటూ తన తొలి సంపాదనను ఇవ్వబోయాడు.

అభయుడు అతనితో, "నాయనా, నువ్వు నాకూ సాలావతికీ పుట్టిన కుమారుడివని





నాకు ఈమధ్యనే తెలిసింది. నిన్ను పెంచినందుకు నాకేమీ ప్రతిఫలం అవసరంలేదు. నువ్వు నా ఆస్తికి వారసుడివై, నా భవనం చెంతనే ఒక భవనం కట్టుకుని వుండవలసింది," అన్నాడు.

కొంతకాలానికి బింబిసార మహారాజుకు ఒక వ్రణం కలిగింది. ఎందరు ఎన్ని చికిత్సలు చేసినా అది మానలేదు. ఈ సంగతి తెలిసి అభయుడు తన తండ్రితో, "నా కొడుకు మంచి వైద్యుడు, వాడిచేత చికిత్స పొందరాదా ?" అన్నాడు. బింబిసారుడు జీవకుణ్ణి ఏకాంతంగా తన గదికి పిలిపించి తన వ్రణం సంగతిచెప్పాడు. జీవకుడు తన గోరుతో కొంచెం లేపం తీసుకుని దానిని తన తాతగారి వ్రణంపైన పూశాడు. వెంటనే మహారాజుకు బాధ నివారణ అయింది, వ్రణం అణిగిపోయింది.

ఈ అద్భుత చికిత్సను బింబిసార మహారాజు నమ్మలేకపోయాడు. ఇలాటి విద్య చేతిలో గల జీవకుడు సజ్జనుడైతే దేశానికి ఎంత క్షేమమో, దుర్జనుడైతే అంత అపాయం. అతను సజ్జనుడో, దుర్జనుడో తెల్సుకోవాలనుకున్నాడు మహారాజు. అతనిని పరీక్షకు పెట్టటందుకుగాను ఆయన తన అయిదువందలమంది రాణులనూ



పిలిచి, వారి సమక్షంలో జీవకుడు చేసిన అద్భుత చికిత్సను ప్రశంసించి, "అతనిని తగిన విధంగా సత్కరించండి!" అన్నాడు. వారు మేలి వస్త్రాలు బోలెడన్ని తెచ్చి జీవకుడికి సమర్పించారు. ఈ కట్నాలు చూసి అభయుడు మొదలైనవారికి కళ్లు కుట్టాయి. జీవకుడు వాటిని స్వీకరిస్తాడేమోనని వారు భయపడ్డారు.

అయితే జీవకుడు వివేకంలో ఒకరికి తీసిపోయేవాడు కాడు. అతను రాణులతో, "రాజోచితమైన ఈ వస్త్రాలు నాకెందుకు? నేను సామాన్య పౌరుణ్ణి. నన్ను మీ అండన క్షేమంగా బతకనివ్వండి. అదే నాకు పది



వేలు!" అన్నాడు. ఈ మాట విని మహారాజూ, రాణులూ చాలా సంతోషించారు. మహారాజు అతనికి అనేక తోటలూ, గ్రామాలూ రాసిఇచ్చి వాటిమీద వచ్చే ఫలాన్ని అనుభవించమన్నాడు. అది మొదలు జీవకుడు మహారాజు మిత్రవర్గంలో చేరాడు.

రాజగృహంలోనే ఒక ధనవంతుడైన కులీనుడికి తలపోటు వచ్చింది. ఇద్దరు వైద్యులు ఆయనను పరీక్షించి చూసి, ఆ వ్యాధికి చికిత్సలేదనీ, త్వరలోనే ఆ కులీనుడికి మరణంకూడా రానున్నదనీ చెప్పారు. వారిలో ఒకడు వారంరోజులకు మరణం సంభవిస్తుందన్నాడు, రెండవవాడు ఐదు రోజులే గడువిచ్చాడు.

ఆ కులీనుడు రాజగృహానికి ఆయువుపట్టులాంటివాడు. కావటంచేత ఆయన వ్యాధిగ్రస్తుడైనందుకు బింబిసార మహారాజు చాలా చింతించాడు. ఆయన జీవకుణ్ణి పిలిచి, ఆ కులీనుడికి చికిత్స చెయ్యటానికి ప్రయత్నించమన్నాడు. జీవకుడు వెళ్ళి రోగిని పరీక్షించి, "ఈ రోగి శిరస్సులో రెండు పురుగులున్నాయి. ఒకటి పెద్దది, రెండవది చిన్నది. పెద్దది ఐదు రోజులలో చంపుతుంది. చిన్నది వారంరోజులలో చంపుతుంది. ఈ రోగిని లోగడ పరీక్షించిన





వైద్యులు ఒక్కొక్క పురుగును మాత్రమే కనిపెట్టగలిగారు. అయినా ఫలముండలేదు. నేను ఈ వ్యాధిని కుదుర్చుతాను. అయితే అందుకు రెండు షరతులున్నాయి. ఒకటి ఏమిటంటే, నేను ఎంత బాధ కలిగించినా సహించాలి. గురువు విద్యార్థి క్షేమం కోరి శిక్షించే విధంగా, నేను మీ ఆరోగ్యం కోసమే బాధ కలిగిస్తాను. దాన్ని భరించటం వల్ల చివరకు మేలే కలుగుతుంది. ఇక రెండవ విషయమేమంటే, చికిత్స ముగిసినాక ఇరవై ఒక్క నెలలపాటు కదలకుండా పడుకోవాలి. ఈ రెండూ సమ్మతమైతే నేను చికిత్స చేస్తాను," అన్నాడు.

ప్రాణభయంతో కొట్టుకుపోతున్న ధనికుడు వెంటనే అన్నిటికీ సమ్మతించాడు. జీవకుడు రోగిని మేడమీది గదికి చేర్చి, అక్కడ ఒక పదునైన శస్త్రంతో రోగి తలపై గల ఎముకలను కోసి, లోపలినుంచి రెండు పురుగులను పైకి తీసి, తిరిగి తలఎముకలు యథాస్థానంలో ఉంచి కుట్టేశాడు.

ఈ శస్త్రచికిత్సలో ఉండే అద్భుతమైన విషయమేమంటే చికిత్స పూర్తి అయినాక వైద్యుడు తలను ఎక్కడ కోసి కుట్టినది ఎవరికీ తెలియరాలేదు. రోగికి బాధ యావత్తూ నివారణ అయింది. "ఇరవై ఒక్క నెలలు కదలకుండా పడుకోవాలన్నానుగాని, ఇరవై





ఒక్కరోజు పడుకుంటే చాలు!" అని జీవకుడు కులీనుడికి చెప్పాడు.

కులీనుడు జీవకుడికి అంతులేని ధనం బహూకరించబోయాడు. కాని జీవకుడు దాన్ని స్వీకరించక, రాజుగారివద్ద ఒక లక్ష, సంపన్నుడివద్ద మరొక లక్ష, చిల్లర బహుమానాలూ మాత్రమే స్వీకరించాడు. జీవకుడి ఖ్యాతి జంబూద్వీపమంతటా పాకింది.

కాశీనగరంలో ఒక కులీనుడుండేవాడు. ఆయన చిన్నతనంలో దూకుతుండగా పేగు ముడి పడిపోయింది. అదిమొదలు ఆయన మామూలుగా భోజనం చెయ్యలేక, మల విసర్జన చేయలేక, పలచని ఆహారంతో



ప్రాణం కాపాడుకుంటూ, క్రమంగా చిక్కి ఎముకల పోగైపోయాడు. ఆయనకు చికిత్స చేస్తామంటూ ఎక్కడెక్కడినుంచో వైద్యులు వచ్చి, ఆయనను పరీక్షించి, తమవల్ల కాదని తల అడ్డంగా తిప్పి వెళ్ళిపోసాగారు.

రోగి తండ్రి జీవకుడి పేరు ప్రతిష్ఠలను గురించి విన్నవాడై, మంచిమంచి కానుకలు తీసుకుని రాజగృహానికి వెళ్ళి, బింబిసార మహారాజు దర్శనం చేసుకుని, "మహారాజా, నా కుమారుడికి చికిత్స చేయటానికి జీవకుణ్ణి పంపండి!" అని వేడుకున్నాడు.

బింబిసారుడి కోరికపై జీవకుడు కాశీకి ప్రయాణమై వెళ్ళి రోగిని చూశాడు. "ఈ వ్యాధి దూకేటప్పుడుగాని, భారీగా శ్రమ చేసేటప్పుడుగాని వచ్చిందా? పేగుల్లో ఉండ చుట్టుకున్నట్టుగా ఏమైనా ఉంటుందా?" అని జీవకుడు రోగిని అడిగాడు. రోగి ఔనన్నాడు.

జీవకుడు అందరినీ గదిలోనుంచి బయటికి పంపేసి, రోగిని ఒక స్తంభానికి గట్టిగా అంటగట్టి, అతని ముఖాన్ని కప్పి, పదునైన శస్త్రంతో రోగి పొత్తికడుపు కోసి, పేగు పైకి లాగి సరిచేసి, మళ్ళీ లోపల పెట్టేసి కుట్టి, పైన ఏదో లేపం పూసి, తరవాత రోగిని స్తంభంనుంచి విప్పి జావ పథ్యం పెట్టిం





దాడు. మూడో రోజుకల్లా రోగి మామూలు మనిషిలాగా లేచి తిరగసాగాడు.

ఈ చికిత్స చేసినందుకు జీవకుడికి 16 వేల సువర్ణాలు కట్నంగానూ, అంతులేని గుర్రాలూ, రథాలూ, గోవులూ, దాసదాసీలూ కానుకలుగానూ లభించాయి. వాటన్నిటినీ వెంటబెట్టుకుని వైభవంగా ఊరేగుతూ జీవకుడు రాజగృహానికి తిరిగి వచ్చాడు. ఆటుతరవాత నానా దేశాలనుంచి జనం వచ్చి జీవకుడి చికిత్సలకోసం ఎగబడ సాగారు.

ఆ కాలంలో ఉజ్జయినికి రాజు చండప్రద్యోతుడు. ఆయనకు పచ్చకామెర్ల వ్యాధి కలిగింది. ఆయన బింబిసార మహారాజుకు కానుకలు పంపి తనకు చికిత్స చేయుటానికి గాను జీవకుణ్ణి పంపమని కబురుచేశాడు. కాని బింబిసారుడు ఎన్నిసార్లు హెచ్చరించినా జీవకుడు బయలుదేరలేదు.

దీనికి కారణం ఉన్నది. ఉజ్జయిని రాజుకు చికిత్స చెయ్యాలంటే నూనె వాడకుండా చికిత్స సాధ్యంకాదు. కాని ఆ రాజుకు ఏ రూపంలోనూ నూనె అంటే పడదు. భోజనంలో నూనె తగలరాదు, శరీరానికి తగలరాదు, ఆఖరుకు చమురు దీపాలను కూడా ఆ రాజు భరించలేడు. అందుచేత జీవకుడు ఆయనకు చికిత్స చేయు



దలచలేదు. కాని ఉజ్జయిని రాజు బింబిసార మహారాజుకు కమ్మలమీద కమ్మలు పంపి, కబురుమీద కబురు చేయసాగాడు. బింబిసారుణ్ణి కాదనలేక చిట్టచివరకు జీవకుడు ఉజ్జయినికి బయలుదేరి వెళ్ళాడు. రాజుకు తెలియకుండా చికిత్స చేయటానికి అతను నిశ్చయించుకున్నాడు. తానిచ్చే ఔషధం ఏమిటో తెలిస్తే అందువల్ల రోగికీ, తనకూ కూడా అపాయం ఉన్నది.

"మహారాజా, నేను తమకు చికిత్స చేస్తాను. కాని నేనిచ్చే ఔషధం ఏమిటో చెప్పను. నేను మూలికలు వెతకటానికి స్వేచ్ఛగా ఊరి బయటికి వెళ్ళివచ్చే సదుపాయాలు చేయించాలి. అలా అయితేనే చికిత్స చేస్తాను!" అని జీవకుడు రాజుతో అన్నాడు.

రాజుగారికి నాలుగు రకాల వాహనాలు—బోయీలు మోసే పల్లకీ, ఒక ఏనుగూ, ఒక కంచరగాడిదా, ఒక గుర్రమూ—ఉన్నాయి. వీటిలో దేనినైనా జీవకుడు యథేచ్ఛగా ఉపయోగించవచ్చునని రాజుగారు ఉత్తరువిచ్చారు. జీవకుడు వాటన్నిటిలోనూ యథేచ్ఛగా తిరిగి మూలికలు పోగుచేసుకువచ్చాడు. ఆ మూలికలను నూనెలో కాచి ఔషధం తయారుచేశాడు. రాజుగారివద్దకు వెళ్ళి "మహారాజా, ఔషధం తయారయింది. జాగుచేస్తే దాని ఘాటు కాస్తా పోతుంది. దాన్ని మీరు రుచిచూస్తూ కూచునే వ్యవధి లేదు. వెంటనే గొంతులో పోసేసుకోవాలి!" అన్నాడు.

రాజు సరేనని ఒకచేత ముక్కు మూసుకుని రెండోచేత మందు తీసుకుని నోట్లో పోసేసుకున్నాడు.

ఆ క్షణంలోనే జీవకుడు ఎవరితోనూ చెప్పకుండా నేరుగా ఏనుగుల సాలకు వెళ్ళి, భద్రవతి అనే తన ఏనుగునెక్కి అతివేగంగా బయలుదేరాడు. వాయువేగంతో అతను కౌశాంబీ నగరానికి వచ్చి చేరి అక్కడ విశ్రాంతి తీసుకున్నాడు. —(ఇంకా ఉంది)






## [13]

ఈ లోపుగా ఉజ్జయినిరాజు మందు మింగి, తాను తాగినది నూనె అని తెలుసుకుని, పట్టరాని ఆగ్రహం చెంది, "ఆ జీవకుణ్ణి పట్టుకుని కొరత వెయ్యండి!" అని ఆజ్ఞాపించాడు. అయితే జీవకుడు భద్రవతిపైన పరారీ అయాడని తెలిసింది. రాజు తన ప్రధాన బోయీ అయిన ఒప్పుణికుడనేవాణ్ణి పిలిచి, "ఒరే, నీవు జీవకుణ్ణి పట్టి తెస్తే గొప్ప బహుమానం ఇస్తాను!" అన్నాడు.

ఒప్పుణికుడు కౌశాంబినగరం చేరి జీవకుణ్ణి కలుసుకుని, "మహారాజుగారు మిమ్మల్ని రమ్మన్నారు!" అని చెప్పాడు.

"నాకు ఆకలిగా ఉన్నది. భోజనం చేసి బయలుదేరుతాను. నువుకూడా నాతోపాటు భోజనం చెయ్యి!" అన్నాడు జీవకుడు. ఒప్పుణికు డిందుకు అంగీకరించలేదు. "పోనీ ఈ పండైనా తిను," అంటూ జీవకుడు ఒక పండును సగానికి కోసి ఒక సగం బోయీకిచ్చాడు.

ఆ పండు తింటూనే ఒప్పుణికుడి శరీరం నిరసంగా అయిపోయింది. వాడు చేతులూ కాళ్ళూ కదల్చలేకపోయాడు.

జీవకుడు తాపీగా భోజనంచేసి, తన ఏనుగుకు నీరు పెట్టించి, ఒప్పుణికుడి వద్దకు వచ్చి, "నన్ను రాజుగారి వద్దకు తీసుకుపోతానంటివిగదా, కదలవేం?" అన్నాడు.

"బాబూ, నన్ను మామూలు మనిషిగా చెయ్యండి. మీరెక్కడికి రమ్మంటే అక్క



డికి వస్తాను, ఏపని చెయ్యమంటే ఆ పని చేస్తాను!" అన్నాడు ఒప్పణికుడు.

"సరే అయితే ఆ మిగిలిన సగంపండూ తిను!" అన్నాడు జీవకుడు నవ్వుతూ.

"అమ్మబాబో! సగంపండు తింటేనే కాళ్ళూ చేతులూ చచ్చుపడిపోయాయే. అది కూడా తింటే పూర్తిగా చచ్చేపోతాను," అన్నాడు ఒప్పణికుడు.

"ఓరి, నేనెప్పుడూ ఎవరి ప్రాణమూ తియలేదు. శరీరం చచ్చుపడిపోయేటట్టు కూడా ఇంతకుముందెవరికీ చెయ్యలేదు. మామూలు మనిషివి అవుతావు. మిగిలిన పండు తిను!" అన్నాడు జీవకుడు.



అతని మాట నమ్మి ఆ ప్రకారమే చేసి ఒప్పణికుడు మామూలు మనిషి అయాడు. "ఇక నీవు ఉజ్జయినికి తిరిగి పో. రాజు కిపాటికి వ్యాధి నయమై ఉంటుంది. అందు చేత ఏమీ అనడు!" అని ఒప్పణికుడితో చెప్పి జీవకుడు తన దారిన రాజగృహానికి వెళ్ళి బింబిసార మహారాజుకు జరిగిన సంగతి యావత్తూ తెలియచేశాడు.

ఇదంతా జరిగిన కొంతకాలానికి జీవకుడు బుద్ధుడికి చికిత్స చేయటం తటస్థించింది. అది ఇలా జరిగింది:

ఒకనాడు ఆనందుడు జీవకుడి వద్దకు వచ్చి బుద్ధుడికి సుస్తీగా ఉన్నదనీ, ఆయనను చూసి చికిత్స చేయమనీ అడిగాడు. జీవకుడు విహారానికి వెళ్ళి బుద్ధుణ్ణి పరీక్ష చేసి ఆయన జబ్బుకు కారణాలు మూడు దోషాలని గ్రహించాడు. అందుకుగాను అతను మూడు ఔషధాలు తయారుచేసి, వాటిని మూడు కమలాలలో ఉంచి బుద్ధుడి కిచ్చి, ఆ కమలాలను వాసన చూసినట్టయితే ఆరోగ్యం చక్కబడుతుందని చెప్పాడు. అలాగే బుద్ధుడికి ఆరోగ్యం చేకూరింది.

జీవకుడి చికిత్సవల్ల ఆరోగ్యం పొందిన చండప్రద్యోతుడు జీవకుడికి కానుకగా రెండు అమూల్యమైన శాలువలను పంపాడు.







వాటిలో ఒకదాన్ని తెచ్చి జీవకుడు బుద్ధుడికి కానుకగా సమర్పించాడు. బుద్ధుడు ఆనందుణ్ణి పిలిచి, "మన భిక్షువులకు ఇలాటి వెలలేని కానుకలు లభించినట్టయితే వారికి చోరభయం సంప్రాప్తమౌతుందేమో!" అన్నాడు.

ఆనందుడు జీవకుడిచ్చిన శాలువను ముప్పై ముక్కలుగా కత్తిరించి, అయిదేసి ముక్కలు కలిపి కుట్టి వస్త్రాలుగా తయారు చేశాడు. ఇది చూసి బుద్ధుడు సంతోషించి, భిక్షువులెవరూ మూడేసి వస్త్రాలకన్న ఎక్కువ ఉంచుకోరాదని, వాటిలో ముప్పై అతుకులుండాలని శాసించాడు.

జీవకుడుకూడా బుద్ధుడి ఉపదేశం విని ఆయన శిష్యగణంలో చేరాడు. ఆయన బుద్ధుణ్ణి ముప్పూటలా చూడాలని కోరాడు. అయితే వేలువన విహారం చాలా దూరం అయిపోయింది. అందుచేత జీవకుడు తన తోటలోనే ఒక విహారం నిర్మించి బుద్ధుణ్ణి అక్కడికి వచ్చి ఉండమని కోరాడు. ఈ సంఘటనలు బుద్ధుడు బుద్ధత్వం పొందిన ఇరవయ్యో సంవత్సరంలో జరిగాయి.

• • •

కోసలదేశపు రాజువద్ద భార్గవుడనే పురోహితుడుండేవాడు. ఆయన భార్య గర్భిణిగా ఉండి ఒక మగశిశువును ప్రసవించింది. ఆ క్షణంలో నగరమంతటా కత్తికటార్లు ధగధగా మెరిశాయి. పురోహితుడీ వింత చూసి ఆశ్చర్యపడి ఒక జ్యోతిష్కుడివద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పాడు. జ్యోతిష్కుడు పిల్లవాడి జాతకచక్రం వేసి, "ఈ జాతకుడు గజదొంగ అవుతాడు!" అన్నాడు.

మర్నాడు ఉదయం పురోహితుడు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, రాత్రి మీరు సుఖంగా నిద్రపోయారా?" అని అడిగాడు.

"లేదు. రాత్రల్లా నా కత్తి మెరుస్తూనే ఉన్నది. నాకో, దేశానికో ఆపద కలిగేలాగుంది," అన్నాడు రాజు.





"మహారాజా, నాకొక కుమారుడు కలిగాడు. వాడు పుట్టగానే, మీకత్తి కాదు, నగరంలో ఉన్న సమస్తమైన ఆయుధాలూ మెరిశాయి. నా కొడుకు గజదొంగ అవుతాడని జ్యోతిష్కులు చెబుతున్నారు. వాణ్ణి వెంటనే కడతేర్చమని సెలవా?" అన్నాడు పురోహితుడు.

"అప్పే, ఒక్కమనిషి దేశానికి ఏపాటి ప్రమాదం చెయ్యగలడు. వాణ్ణి పెంచి పెద్ద వాణ్ణి చెయ్యి," అన్నాడు రాజు.

ఆ కుర్రవాడికి అహింసకుడని పేరుపెట్టి పెంచి పెద్దవాణ్ణి చేశాడు పురోహితుడు. చదువుకునే ఈడు రాగానే అహింసకుడు తక్షశిలకు వెళ్ళి ఒక గురువుదగ్గిర విద్యాభ్యాసం ఆరంభించాడు. మిగిలినవారందరినీ వాడు చదువులో మించిపోయాడు. అది చూసి ఇతర శిష్యులు అసూయ చెంది వాడికి ఎలాగైనా కాస్తి చేయాలని నిశ్చయించి కూడబలుక్కున్నారు.

ఆ తరవాత కొందరు వెళ్ళి గురువుగారితో, అహింసకుడికీ గురువుగారి భార్యకూ ఏదో సంబంధం ఉన్నట్టు చాడీ చెప్పారు. గురువుగారు అది నిజమేనా అని మిగిలినవాళ్లను అడిగితే నిజమే నన్నారు వాళ్లు. గురువుగారు ఈ మాటను నమ్మలేక, నమ్మకుండానూ ఉండలేక, తన భార్య అహింస



కుడిపట్ల ఎలా ప్రవర్తించేదీ గమనించ సాగాడు. పాపం, ఆవిడ వాణ్ణి ఎంతో ఆప్యాయంగా చూసేది; ఆమెకు శిష్యులు చేస్తున్న కుట్రగురించి ఏమీ తెలియదు.

చిట్టచివరకు గురువుగారికి అహింసకుడి పైన మాత్సర్యం ఏర్పడింది. వాణ్ణి చంపేద్దామనుకున్నాడు గాని, ఈ సంగతి తెలిస్తే తనదగ్గిర చదువుకోవటానికి ఎవరూ రారని భయపడ్డాడు. అందుచేత ఆయన అహింసకుణ్ణి పిలిచి, "ఇక నేను నీకు చదువు చెప్పేదిలేదు. నీకు నిజంగానే చదువుకోవాలని ఉంటే వెయ్యిమంది మనుషులను హత్యచేసి, దానికి నిదర్శనంగా వారి చేతి వేలు ఒక్కొక్కటి చొప్పున కోసితెచ్చి నాకు చూపించు. అప్పుడు చదువు చెబుతాను!" అన్నాడు.

"అయ్యా, ఇతరులకు హాని చెయ్యటం మా వంశాచారం కాదు. కాని నాకు చదవాలని అభిలాష బలంగా ఉన్నది. వెయ్యిమందిని చంపితేగాని చదువు చెప్పనంటున్నారు గనక, అది మీ ఆజ్ఞగా భావించి వెయ్యిమందిని హత్యలుచేసి వెయ్యివేళ్లు మీకు తెచ్చి సమర్పించుకుంటాను," అని అహింసకుడు అరణ్యానికి వెళ్లిపోయాడు. ఆ అరణ్యంలో ఎనిమిది దార్లు కలిసేచోట వాడు పొంచిఉండి అటుగా వచ్చేవారంద





రిని హత్యచేసి చచ్చిన ప్రతిమనిషి వేలూ ఒకటి కోసి తనవద్ద పెట్టుకున్నాడు.

ఇందువల్ల వాడికి అంగుళిమాలుడు అని పేరు వచ్చింది.

ఇలా అనేక హత్యలు జరిగి ప్రజలలో కలవరం పుట్టగా కొందరు రాజుగారివద్దకు వెళ్ళి, "మహాప్రభూ, ఎవడో గజదొంగ అరణ్యంలో చేరి అటుగా వెళ్ళినవారినల్లా చంపేస్తున్నాడు. తమరు సైన్యంతోసహ వెళ్ళి వాణ్ణి నాశనం చెయ్యకపోతే దేశం నిర్జనమైపోతుంది," అని మొరపెట్టుకున్నారు. రాజుగారు వారు కోరినప్రకారం సైన్యాన్ని పంపి అంగుళిమాలుణ్ణి చంపెయ్యనిశ్చయించాడు.



ఈ వార్త నగరమంతా పాకింది. పురోహితుడుకూడా సంగతంతా విని తన భార్యతో, "ఈ అంగుళిమాలుడు మన పిల్లవాడే అయి ఉంటాడు. వాణ్ణి సైనికులు చంపేస్తారు. ఏం చేద్దాం?" అన్నాడు.

"రాజుగారు వెళ్ళేలోపలే మీరు వెళ్ళి మన వాణ్ణి మంచిగా ఇంటికి తెచ్చెయ్యండి," అన్నది పురోహితుడి భార్య.

"నేను వెళ్ళను! దొంగనూ, చెట్టు కొమ్మనూ, రాజునూ, ఆడదాన్నీ నమ్మరాదని శాస్త్రం!" అన్నాడు పురోహితుడు.

"అయితే నేనే వెళతాను!" అంటూ పురోహితుడి భార్య బయలుదేరింది.

ఈలోపుగా అహింసకుడు తొమ్మిదివందల తొంభైతొమ్మిది హత్యలు చేసి చచ్చినవారి వేళ్ళు సంపాదించాడు. ఇంకొక్క మనిషిని హత్యచేస్తే వాడికి గురువుగారి ఋణం తీరిపోతుంది. ఎవరు కనిపిస్తే వారిని చంపటానికి సిద్ధపడి వాడు అరణ్యంలో ఒక చోట పొంచి ఉన్నాడు.

నిజానికి వెయ్యోమనిషి వాడి తల్లి కావలసిందే. కాని ఆమె అరణ్యంలోకి వచ్చేలోపుగా బుద్ధుడు అటుకేసి రావటం జరిగింది. దారిలో కొందరు గొర్రెలకాపర్లు బుద్ధుణ్ణి చూసి, "స్వామీ, అటుగా వెళు



తున్నారా? ఆ దారిన నలభై, యాభైమందికి తక్కువ సంఖ్యలో వెళ్లటానికి ఎవరూ సాహసించరు. అక్కడ గజదొంగ ఉన్నాడు, ఒంటరిగా చిక్కినవారందరి ప్రాణాలూ తీస్తాడు!" అన్నారు.

కాని బుద్ధుడు ఆ గొర్రెలకాపరుల హెచ్చరికలు లక్ష్యపెట్టకుండా అరణ్యంలో ముందుకు నడిచాడు.

అంగుళిమాలుడు దూరానే సన్యాసిని ఒకణ్ణి చూసి, "ఈ మనిషిని చంపేశానంటే నా పని పూర్తి అవుతుంది!" అని సంతోషించాడు. నిజానికి వాడి కిది మంచి అవకాశంగా కనబడింది. ఎందుకంటే వాడు లోగడ చేసిన హత్యల ఫలితంగా మనుషులు జాగర్తగా మసులుకుంటూ వాడికి అందకుండా తిరుగుతున్నారు.

బుద్ధుడు నడిచిపోతుంటే ఆయనను అందుకోవటానికి అంగుళిమాలుడు వెంట పడ్డాడు. వాడు ఎంత వేగంగా పరిగెత్తినా ముందుపోతున్న బుద్ధుణ్ణి కలుసుకోవటం సాధ్యంకాలేదు. "నేను పరుగు తీసి గుర్రాలనూ, ఏనుగులనూ, రథాలనూ కూడా అందుకున్నాను, కాని ఈ సన్యాసి అందడేమిటి?" అని వాడు లోపల ఆశ్చర్యపడుతూ, "ఓ సన్యాసీ, ఆగు!" అని ఎలుగెత్తి కేక పెట్టాడు.

బుద్ధుడు ఆగి, "నువ్వుమాత్రం నా దగ్గిరికి రాకు!" అన్నాడు. తరవాత ఆయన వాడికి భూతదయను గురించి, హింసచేసే వాడు అనుభవించే నరకాలను గురించి బోధచేశాడు.

బుద్ధుడి మాటలు వింటున్నకొద్దీ అంగుళిమాలుడి మనసులో ఏదో పరివర్తన వచ్చేసింది. వాడు పూర్వజన్మలో చేసుకున్న పుణ్యమంతా ఒక్కసారిగా పండి పక్వానికి వచ్చినట్టయింది. వాడు అప్పటికప్పుడే బుద్ధుడికి శిష్యుడై ఆయన వెంట జేతవనానికి వెళ్ళాడు. —(ఇంకా వుంది)





# అహింసాజ్యోతి

## [14]

అంగుళిమాలుడి తల్లిదండ్రులు తమ కొడుకుకోసం అరణ్యమంతా వెతికారు, కాని వాడి జాడ లేకపోయింది. సైన్యాన్ని తీసుకుని అరణ్యానికి వెళ్ళి తన ప్రజల పాలిట యముడుగా ఉన్న అంగుళిమాలుణ్ణి చంపు తానని మాట ఇచ్చిన రాజుగారు తీరా వెళ్ళ వలసి వచ్చేసరికి భయపడ్డారు. అందుచేత ఆయన బుద్ధుడి సలహాకోసం విహారానికి వెళ్ళి బుద్ధుడి కాళ్ళపై పడ్డారు.

"రాజా, ఏం జరిగింది? బింబిసారుడు నీతో కలహించాడా? విశాలానగర రాజులు గాని, ఇతరులుగాని నీపై కత్తికట్టారా? నీకు వచ్చిన ఆపద ఏమిటి?" అని బుద్ధుడు రాజు నడిగాడు.

"అదేమీ కాదు. నేను అంగుళిమాలుడనే హంతకుణ్ణి పరిమార్చటానికి అరణ్యానికి బయలుదేరుతున్నాను," అన్నాడు రాజు.

"అతను భిక్షువు అయి ఉంటే ఏం చేస్తావు?" అని బుద్ధుడు అడిగాడు.

"తగిన విధంగా అర్చిస్తాను!" అని రాజు జవాబు చెప్పాడు. అయితే అలాటి పాపిని బుద్ధుడు తన శిష్యకోటిలో చేర్చు కుంటాడని ఆయన ఒక్కనాటికి అనుకో లేదు. కాని ఆ గజదొంగ ఆ క్షణాన ఆ విహా రంలోనే ఉన్నాడని తెలిసేసరికి రాజుకు ముచ్చెమటలు పోశాయి.

"రాజా, నీవు భయపడవలసిన అవసర మేమీ లేదు!" అని బుద్ధుడు ఆయనకు



ధైర్యం చెప్పాడు. బుద్ధుడు యిలా అనగానే రాజు తేరుకుని, "స్వామీ, అతను ఎక్కడ ఉన్నాడో నాకు చూపండి!" అన్నాడు.

ఆయన అంగుళిమాలుడి ముందు నిలబడి తన కాసెకోక విప్పి అతనికి సమర్పించాడు, కాని అంగుళిమాలుడు దాన్ని స్వీకరించలేదు.

"ఇది చాలా అద్భుతం! ఇంత మార్పు ఈ మనిషిలో ఎలా వచ్చింది?" అన్నాడు రాజు ఆశ్చర్యపోతూ.

తరవాత అంగుళిమాలుడు భిక్షాపాత్ర తీసుకుని తన గ్రామంలో భిక్షకు వెళ్ళాడు. అతన్ని చూసి జనం భయపడి పారిపో



యారు, ఎవరూ భిక్ష పెట్టలేదు. అతనికి ఆకలి దహించుకుపోతున్నది. అతను నగరానికి తిరిగి వచ్చి అక్కడ ఒక స్త్రీ ప్రసవించలేక బాధపడుతూండటం చూశాడు. ఆమెమీద అతనికి ఎంతో కనికరం కలిగింది. 999 మందిని నిశ్చింతగా హత్యచేసిన ఆ మనిషి బుద్ధుడి అనుచరుడయాక ఒక స్త్రీ పడే ప్రసవ వేదనకు కరిగిపోయాడు.

అతను విహారానికి తిరిగివచ్చి బుద్ధుడితో ఆ స్త్రీని గురించి చెప్పాడు.

"'నేను ఈ జన్మలో బుద్ధిపూర్వకంగా ఏ ప్రాణినీ హింసించనివాణ్ణి అయినట్టయితే ఈ స్త్రీ సుఖంగా ప్రసవించుగాక!' అని సత్యప్రమాణం చెయ్యి. ఆమె ప్రసవిస్తుంది," అన్నాడు బుద్ధుడు.

"స్వామీ, నేను అనేకమందిని హత్య చేశాను. అసత్యప్రమాణం చెయ్యలేను," అన్నాడు అంగుళిమాలుడు.

"నిజమే కాని, నీవు హత్యలు చేసినది ఈ జన్మలో కాదు. నీవు నాదగ్గిర చేరాక ఇంకొక జన్మ ఎత్తావు. ఆ కారణంవల్ల, నీవు చేసేది అసత్యప్రమాణం కాదు," అన్నాడు బుద్ధుడు.

అంగుళిమాలుడు నగరానికి తిరిగి వెళ్ళి ప్రసవించలేక బాధపడుతున్న స్త్రీ వద్ద





బుద్ధుడు చెప్పిన విధంగా సత్యప్రమాణం చేశాడు. మరుక్షణమే ఆ స్త్రీకి సుఖప్రసవం అయింది. ఈ ప్రసవం జరిగిన చోట ఒక భవనం కట్టారు. రోగులైన స్త్రీలు ఆ భవనం లోకి అడుగు పెట్టితే అంగుళిమాలుడి ప్రభావంచేత వారి రోగాలన్నీ పోయేవట.

తనను చూసి భయపడి భిక్ష పెట్టని వాళ్ళను చూసి అంగుళిమాలుడు చాలా బాధపడేవాడు. తాను చేసిన హత్యలుకూడా అతన్ని చాలా బాధించేవి. తన చేతిన చచ్చి పోయినవారు తమ ప్రాణాలు తీయవద్దని, తమపై కరుణ చూపమని, తాము చస్తే తమ బిడ్డలు అనాథలైపోతారనీ ఎన్నో విధాల బతిమాలారు. ఆ సంగతులు స్మరించుకుని అతని గుండె కొట్టుకుపోయేది. అతను ఇలా బాధపడుతూంటే బుద్ధుడు అతన్ని ఓదార్చి, "వాటిని గత జన్మ వృత్తాంతాలుగా భావించు" అని హితబోధ చేసేవాడు. కిందటి జన్మలో చేసుకున్న ఫలితాలు అనుభవించటానికి విచారించటం అంత ముఖ్యం కాదని, ముందుజన్మ లేకుండా చేసుకోవటమే అన్నిటికన్న ముఖ్యమనీ ఆయన అనేవాడు.

అంగుళిమాలుడిలాగే ఇంకా ఎందరో దొంగలూ, హంతకులూ బుద్ధుడి ప్రబోధాలు



విని పరివర్తన పొంది తమ జీవితాలను మార్చుకుని ఆయన శిష్యులయారు.

• • •

కుసీనరదేశంలో బంధులుడు అనే మహా వీరుడుండేవాడు. అతను మాళ్వదేశపు రాజుకు మేనల్లుడు. కత్తి, బాణా, విల్లూ, గదా, ఈ కే—వీటిని ప్రయోగించటంలో అతనికి సమానులు జంబూద్వీపంలో మరె వరూ లేరట. అతను యువకుడై ఉండగా అతని మేనమామ అయిన మాళ్వరాజు ఇత నికి ఒక పరీక్ష పెట్టాడు. ఆయన అరవై వెదురు కర్రలలో అరవై ఇనప ఊచలు పెట్టి, ఆ వెదురు కర్రలన్నిటినీ ఒక





మోపుగా కట్టి, బంధులుడితో, "నువ్వు ఒక్క కత్తివేటుతో ఈ వెదుళ్ళ నన్నిటినీ తెగవేసి నట్టయితే నీకు నా కుమార్తెనిచ్చి పెళ్ళి చేస్తాను. ఒకవేళ ఈ పరీక్షలో నువ్వు ఓడి పోవటం జరిగితే, నేను మరొక అల్లుణ్ణి చూసుకుంటాను," అన్నాడు.

బంధులుడికి అదేమంత గొప్పగా కని పించలేదు. అతను తన కత్తినెత్తి వెదుళ్ళ కట్టను ఒక్క వేటు వేశాడు. ఆ దెబ్బకు 60 వెదుళ్ళూ, వాటిలో ఉన్న ఇనప చువ్వలూ తెగిపోయాయి. ఇనపచువ్వలు గలగలమన గానే బంధులుడికి తన మామ చేసిన పని తెలిసిపోయింది. అందరి ఎదటా తనను అవ



మానించటానికే ఆయన అలా చేశాడని గ్రహించి, రాజకుమార్తె అయిన బంధు మల్లికను పెళ్ళాడుతూనే, అతను తన మామతో, "నేను నీ దేశంలో ఉండను. మరెక్కడికైనా వెళ్ళి జీవిస్తాను," అన్నాడు. అతను భార్యతో సహా బయలుదేరి నగరం దాటి వెళ్ళిపోతూంటే రాజుగారూ, ఇతరులూ ఆపాలని చూశారు. కాని అది వారికి సాధ్యం కాలేదు.

కోసలదేశపు రాజు బంధులుడి సహాధ్యాయి. అందుచేత బంధులుడు ఆయన వద్దకు వెళ్ళాడు. రాజు అతన్ని ఎంతో ఆదరంతో చేరదీసి, "నీవంటి బలశాలి అండ ఉంటే జంబూద్వీపమంతా గెలవనా?" అంటూ బంధులుణ్ణి తన సర్వసేనానిగా నియమించాడు. ఇప్పుడు కోసలదేశంలో రాజు తరవాత రాజంతవాడు బంధులుడే. కోసలకు బంధులుడు అండ అయాడని విని మిగిలిన రాజులు వణికిపోయారు.

బంధులుడి భార్యకూడా సామాన్యురాలు కాదు. ఆమెకు అయిదు ఏనుగుల బలం ఉండేది. ఆమెవద్ద మేఖల అనే ఆభరణం ఉండేది. ఆమె బుద్ధుడి శిష్యురాలు. ఆమెకు సంతానం లేకపోవటం ఒక్కటే బంధులుణ్ణి బాధించింది. ఆమె గర్భాన తనలాటి బల








గాలి అయిన కొడుకు కలగాలని అతను ఎంతగానో కాంక్షించాడు. చివరకు బంధులుడు ఆమెను వదిలేసి మరొక భార్యను చేసుకోవటానికి నిశ్చయించుకుని, "నీవు మీ పుట్టింటికి వెళ్లిపో!" అన్నాడు.

ఈ మాట వినేసరికి ఆమెకు చాలా విచారం కలిగింది. కోసలలో ఉంటూ ఆమె బుద్ధుడి బోధలు వినగలుగుతున్నది. పుట్టింటికి వెళ్లిపోతే ఇక అందుకు అవకాశం ఉండదు. ఈ విచారంతో ఆమె బుద్ధుడి సలహాకోసం వెళ్లింది.

బుద్ధుడు ఆమె కథ అంతా విని, "నీవు బంధులుడి వద్దకే తిరిగి వెళ్ళు!" అన్నాడు. బుద్ధుడు ఏదో మనసులో ఉంచుకొని తన భార్యకు ఈ సలహా ఇచ్చాడన్న నమ్మకంతో బంధులుడు తన భార్యను మళ్లీ స్వీకరించాడు. అది మొదలు వారు ఎప్పటిలాగే అన్యోన్యంగా ఉంటూ వచ్చారు.

కొంతకాలానికి బంధుమల్లిక గర్భవతి కూడా అయింది. ఆమె ఒకనాడు తన భర్తతో, "నాకు లిచ్ఛవి రాజకన్యలు స్నానంచేసే కొలనులో స్నానంచెయ్యాలని ఉన్నది," అన్నది. బంధులుడు వెంటనే ఆమెను తీసుకుని విశాలానగరానికి వెళ్లాడు. ఆ నగరపు కోట ద్వారాన్ని కాచేవాళ్లు బంధులుణ్ణి నివారించటానికి ఎలాటి ప్రయత్నమూ చేయలేదు.

బంధులుడు తన భార్యను నేరుగా క్రీడా సరోవరానికి తీసుకువెళ్ళాడు. దాని చుట్టూ ఇనప అలవ ఉన్నది. బంధులుడు దాన్ని అవలీలగా తన కత్తితో ఛేదించి, తానుకూడా తన భార్యతోబాటు జలక్రీడలాడి తరవాత ఇంటికి బయలుదేరాడు.

ఈ సంగతి లిచ్ఛవి రాజకుమారులకు తెలిసి మండిపడ్డారు. వారు తమ రాజుగారి వద్దకు వెళ్లి బంధులుడి ప్రవర్తనవల్ల తమ నగరానికి తీరని అవమానం జరిగిందన్నారు. అతన్ని చంపి అతని శిరస్సు తెచ్చినదాకా





తన భార్యతో తిరిగిపోతున్న బంధులుడు తనను వెన్నంటి వచ్చే లిచ్ఛవి రాజకుమారుల గొల్లును చూసి, బలమైన బాణం ఎక్కుపెట్టి, అయిదువందల రాజకుమారుల శరీరాలూ దూసుకుపోయేలాగ కొట్టి మళ్ళీ ప్రయాణం సాగించాడు.

తాము దెబ్బ తిన్నామన్న సంగతికూడా లిచ్ఛవులు గ్రహించలేదు. వారు బంధులుడిపై బాణాలు వేస్తూ, "పిరికిపందా! నిలబడి మాతో యుద్ధం చెయ్యి," అని పెద్దగా కేకలు పెట్టారు.

"నేను చచ్చిపోయినవాళ్ళతో యుద్ధం చెయ్యను. మీరంతా చచ్చిపోయారు!" అన్నాడు బంధులుడు.

ఈ మాటలు లిచ్ఛవి రాజకుమారులలో ఏ ఒక్కరూ నమ్మలేదు.

"మీ కవచాలు విప్పెయ్యండి, నిజం మీకే తెలుస్తుంది," అన్నాడు బంధులుడు. ఇద్దరు లిచ్ఛవులు తమ కవచాలు విప్పి చచ్చి పడిపోయారు. ఇది చూడగానే భీతాహులై మిగిలినవారంతా ఇళ్ళకు తిరిగిపోయి, అక్కడ తమ కవచాలు విప్పుతూనే చచ్చి పడిపోయారు.

బంధుమల్లిక సకాలంలో ఇద్దరు కుమారులను ప్రసవించింది. ఆ తరవాత ఆమె

అన్నం ముట్టమన్నారు. ఈ ప్రతిజ్ఞతో 500 మంది రాజకుమారులు రథాలెక్కి బంధులుణ్ణి వెన్నంటటానికి సిద్ధమయారు.

"అతను బలాఢ్యుడు, ఒక్క వేటుతో మిమ్మల్నందర్నీ నాశనం చెయ్యగలడు. తొందరపడకండి!" అని రాజు వారికి హితం చెప్పాడు.

"అతను మనిషి కాడా? మేమేమన్నా ఆడవాళ్ళమా?" అన్నారు రాజకుమారులు. రాజు వారికి మాయోపాయాలతో బంధులుణ్ణి గెలవమని సలహా ఇవ్వబోయాడు, కాని వారాయన మాటలు లక్ష్యపెట్టక రథాలపై ఒకరి వెనకగా ఒకరు బయలుదేరారు.



ఏటా ఇద్దరేసి కుమారులను ప్రసవించి, ముప్పై ఇద్దరు పిల్లల తల్లి అయింది.

* * *

శుద్ధోదన మహారాజు రెండవ భార్య ప్రజాపతి. సిద్ధార్థుణ్ణి కన్న మాయాదేవి ఏడు రోజుల బాలింతరాలుగా మరణించగా, ప్రజాపతి తన కొడుకైన నందుణ్ణి పెంచటానికి దాదులను నియోగించి సిద్ధార్థుణ్ణి తానే స్వయంగా పెంచి, అతనికి తల్లి అయింది. సిద్ధార్థుడు బుద్ధత్వం సంపాదించిన అనంతరం కపిలవస్తునగరానికి రాగా శుద్ధోదన మహారాజుతోబాటు ప్రజాపతికూడా బుద్ధ మతం అవలంబించింది.

ప్రజాపతి, మాయాదేవికూడా కోలిరాజు కుమార్తెలు.

కపిలవస్తు నగరానికి కోలీ నగరానికీ మధ్యగా రోహిణినది ప్రవహిస్తుంది. ఈ నదికి ఆనకట్ట కట్టి నదిజలాన్ని ఉభయ నగరాల వారూ పొలాలకు పెట్టుకునేవారు. అయితే ఒకఏడు వానలు లేక నదిలో నీరు తగ్గిపోయింది. నదికి రెండువైపులా ఉండే పొలాలకు చాలినంత నీరు లేదు.

"ఈ నీటిని ఉపయోగించుకునే మొదటి హక్కు మాదే!" అన్నారు కపిలవస్తు ప్రజలు. కోలీ ప్రజలు కూడా ఆమాటే



అన్నారు. జగడం ఆరంభమయింది. రెండు పక్షాలా వందల వందల మంది చేరి ఒకరినొకరు దుమ్మెత్తి పోసుకున్నారు. శాక్యులు తమ ఆధిక్యతను కత్తులతో రుజువుచేస్తామన్నారు, కోలీయులుకూడా వెనకాడక కత్తులు దూశారు. నదీతీరాన రెండుపక్షాల సేనలూ కూడాయి. ఉభయ దేశాలకూ చెందిన పరిపాలకులు తమ పక్షాలను శాంతింపజేయలేకపోయారు.

ఆ సమయాన బుద్ధుడు అటుగా వచ్చాడు. బుద్ధుడి సమక్షంలో యుద్ధం చెయ్యటం భావ్యంగా ఉండదని శాక్యులూ, కోలీయులూ కూడా తమ ఆయుధాలను



దాచిపెట్టారు. బుద్ధుడు నదిగట్టున ఎత్తయిన చోట కూచుని అందరి వందనాలూ అందుకుని, "ఏదైనా తిప్పతిరునాళ్ళు చేయ వచ్చారా ఏమిటి? ఎందుకింతమంది గుమి కూడారు?" అని ప్రశ్నించాడు.

"యుద్ధం చేయవచ్చాం!" అని వారు బుద్ధుడితో చెప్పారు.

"యుద్ధమా? ఎందుకు?" అని బుద్ధుడు అడిగాడు.

నాయకులైన రాజులు అసలు కారణమేమిటో తమకు తెలియదన్నారు. విచారిస్తూ పోగా నీటి తగాదా అని రైతులద్వారా బుద్ధుడికి తెలిసింది.

"నీటి విలువ ఏమిటి? భూమి విలువ ఏమిటి? ప్రాణాల విలువ ఏమిటి?" అని బుద్ధుడు అడిగాడు.

నీటికన్నా, భూమికన్నా ప్రాణాల విలువే ఎక్కువని, అక్కడచేరిన ప్రజలూ, రాజులూ ఒప్పుకున్నారు.

తరవాత బుద్ధుడు అక్కడ చేరినవారికి తన బోధలు వినిపించాడు. దాని ఫలితంగా శాక్యులూ, కోలీయులూ జగడం మాని తమ ఉత్తమ కుటుంబాలనుంచి 250 మంది యువకుల చొప్పున బుద్ధుడి అనుచరులుగా పంపారు. బుద్ధుడు ఈ 500 మందితోనూ మహావన విహారంవద్ద కొంతకాలం ఉన్నాడు. ఈ యువకులు అప్పుడప్పుడూ తమ నగరాలకువెళ్ళి వస్తూండేవారు. వారిని తిరిగి గృహస్థులను చేయాలని వారి భార్యలు గట్టి ప్రయత్నం చేశారు. కాని బుద్ధుడు యువకుల మనస్సులను దృఢంగా చేసి ఈ ప్రయత్నం కొనసాగకుండా చేశాడు.

తరవాత 500 మంది రాజకుమార్తెలూ ప్రజాపతి వద్దకు వెళ్ళి, "దేవి, మా భర్తలు బౌద్ధ సన్యాసులైపోయారు. భర్తలు లేని బతుకు మాకెందుకు? మేముకూడా సన్యాసినులమైపోతాం!" అన్నారు.

—(ముగింపు పై సంచికలో)






[15]

ఈ సమయానికే శుద్ధోదన మహారాజు మరణించాడు. ఆయనకు అంత్యక్రియలు జరుగుతున్నాయి. ఆ కారణంచేత బుద్ధుడు కపిలవస్తు సమీపంలో ఉన్న నిగ్రోధారామ విహారానికి వచ్చాడు. ప్రజాపతి బుద్ధుడి వద్దకు వెళ్లి, "నాయనా, శుద్ధోదన మహారాజు దేహం చాలించాడు. రాహులుడూ, నందుడూ కూడా నీ అనుచరులైపోయారు. నేనిక ఒంటరి జీవితం గడపలేను. నన్నూ, నా వెంట ఉన్న ఈ 500 మంది స్త్రీలనూ నీ అనుచరులుగా స్వీకరించి, మాకు సన్యాసం ఇప్పించు," అన్నది.

స్త్రీలను శిష్యురాళ్లుగా తీసుకున్నట్టయితే పామరుల దృష్టిలో తన అనుచరులూ, ఉద్యమమూ అపఖ్యాతి పాలవుతుందని శంకించి, "స్త్రీల మూలంగా నా ఉద్యమం అపవిత్రమవుతుంది," అన్నాడు బుద్ధుడు. ప్రజాపతి ఎంత ప్రాధేయపడినా బుద్ధుడు తన మనసు మార్చుకోలేదు.

ఆయన నిగ్రోధారామంనుంచి కదిలి విశాలానగర సమీపాన ఉండే కూటాగార శాలకు వెళ్ళాడు. ప్రజాపతి తనవెంట ఉన్న స్త్రీలను తీసుకుని అక్కడికి వెళ్లింది. ఈ సారి రాజకుమార్తెలు తమ కేశాలను ఖండించుకుని, సన్యాసి దుస్తులు ధరించి, మట్టితో చేసిన భిక్షాపాత్రలు పట్టుకుని, కాలి నడకను విశాలానగరానికి వచ్చారు. మెత్తని పై అంతస్తునుంచి కిందికి దిగితేనే కందిపోయే



టంత సౌకుమార్యం గల ఈ స్త్రీలు ఇంత దూరం నడిచేసరికి వారి పాదాలు బొబ్బలెక్కాయి. వీరు కాలినడకన వెళుతున్నారన్న వార్తలు విని వీరిని చూడటానికి తండోపతండాలుగా జనం వచ్చారు. కొందరు వారికి తమ ఇళ్ళనుంచి ఆహారం తెచ్చి ఇచ్చారు. మరికొందరు వారిని డోలీలలోనూ, మేనాలలోనూ తీసుకుపోతామన్నారు. కాని స్త్రీలు ఇలాటి సహాయాలన్నిటిని నిరాకరించి, యాభైఒక్క యోజనం దూరం నడిచి విశాలానగరం చేరారు.

వారు బుద్ధుడి విహారాన్ని చేరుకునేసరికి సాయంకాల మయింది. వారు లోపలికి వెళ్ళక బయటనే ఆగారు. ఆనందుడు ఎక్కడినుంచో వస్తూ వారిని చూశాడు. పాదాల నెత్తురు కారుతూ, దుమ్ముకొట్టుకుని, సగం చచ్చిఉన్న ఆ స్త్రీలను చూసేసరికి అతని మనసులో భరించరాని వేదన కలిగింది. అతను కన్నుల నీరు కారుస్తూ, "మీరంతా ఇలా ఎందుకు వచ్చేశారు? శాక్యులను శత్రువులు నగరంనుంచి తరిమివేశారా? బుద్ధుడి తల్లి ఇలాటి చోటికి ఎందుకు రావలసి వచ్చింది?" అని అడిగాడు. ప్రజాపతి ఆనందుడికి సంగతి యావత్తూ చెప్పింది. అతను వారిని అక్కడే ఉండమని లోపలికి వెళ్ళి, బుద్ధుడితో ఆ స్త్రీలను గురించి చెప్పి, వారి కోరికను తెలియబరిచాడు. "ఆనందా, మన ఆశ్రమంలో ఆడవారిని చేర్చటానికి యత్నించకు!" అన్నాడు బుద్ధుడు. "మనలో చేరటానికి రాజమాత కూడా అర్హురాలుకాదా?" అని ఆనందుడు అడిగాడు. బుద్ధుడు వెనకటి సమాధానమే చెప్పాడు.

"స్త్రీని శిష్యగణంలో చేర్చుకుంటే ఆమె దానివల్ల తరించదా?" అని ఆనందుడు మళ్ళీ అడిగాడు.

దానికి బుద్ధుడు, "బుద్ధులు జన్మించేది కేవలం పురుషులను తరింపచేయటానికే



కాదు. నా ప్రబోధాలు విని ఎంతమంది స్త్రీలు, విశాఖ మొదలైనవారు, ఉపాసికలు కాలేదు?" అన్నాడు.

"స్వామీ, అలా అయితే స్త్రీలనుకూడా మనం స్వీకరించవచ్చు, మీకు ముందు అవతరించిన ఇరవైనలుగురు బుద్ధులూ స్త్రీలను చేరదీసినట్టు మీరే ఒకప్పుడు చెప్పి ఉన్నారు," అన్నాడు ఆనందుడు.

ఈ మాటలకు బుద్ధుడు సుముఖుడయాడుగాని పైకి ఏమీ అనలేదు, అనుమతికూడా ఇవ్వలేదు.

"స్త్రీలను శిష్యురాళ్ళుగా చేర్చుకోవచ్చునని తెలిపోతున్నది. అలాటప్పుడు, బుద్ధుడికి ఎంతో సేవ చేసిన ప్రజాపతిని చేర్చుకోవటానికి అభ్యంతరమేమిటి?" అని ఆనందుడు అడిగాడు.

బుద్ధుడు ఆలోచించి, "ఎనిమిది నియమాలు పాటించినట్టయితే ప్రజాపతి మనలో చేరవచ్చు," అన్నాడు.

ఆనందుడు స్త్రీల వద్దకు తిరిగివచ్చి బుద్ధుడు చేసిన ఎనిమిది నియమాలనూ వారికి తెలియజేశాడు. వారు వాటిని పాటించటానికి ఒప్పుకున్నారు. అందరి సమక్షంలో వారు ఆశ్రమంలోకి స్వీకరించబడ్డారు. ప్రజాపతి స్త్రీలకు పెద్దగా నియోగించబడింది. తరవాత కొద్దికాలానికే ఆమె భావనా





సమాధిద్వారా అర్హతురాలయింది. అది మొదలు స్త్రీలు అంతులేని సంఖ్యలో విహారానికి వచ్చి బుద్ధుడి వెంట సన్యాసినులుగా చేరారు.

కొంతకాలం గడిచింది. ప్రజాపతికి నిర్వాణం చెందాలన్న కోరిక కలిగింది. బుద్ధధర్మం అవలంబించినవారిలో అప్పటికి నిర్వాణం చెందినవారు లేరని ఆమె తెలుసుకున్నది. ఆమె బుద్ధుడితో, "నాయనా, నీ శిష్యులలో మొట్టమొదటగా నిర్వాణం చెందాలని ఉన్నది. అందుకు అనుమతించి, నా వల్ల ఏవైనా అపచారాలు జరిగిఉంటే క్షమించు!" అన్నది.

"చింతామణి వజ్రాన్ని సానపట్టటం ఎంత అనవసరమో నిన్ను క్షమించడం అంత అనవసరం. అదీగాక నిర్వాణాన్ని అందుకున్నవారు ఒకరినొకరు క్షమించ నవసరం లేదు. నన్ను అనుసరించినవారిలో మొదట నిర్వాణం పొందే మహాభాగ్యం నీకే దక్కుతుంది," అన్నాడు బుద్ధుడు.

అన్యకౌండిన్యుడూ, రాహులుడూ మొదలైనవారి సమక్షంలో ప్రజాపతి దేహం చాలించింది. ఆమె అంత్యక్రియలకు బుద్ధుడి అనుచరులందరూ ఆహ్వానించబడ్డారు. ఆమె దహనక్రియలప్పుడు దేవతలు ఆమెకోసం విమానంతో వచ్చారని, ఈ గౌరవం బుద్ధు





డికిగాని, ఆయన శిష్యులలో మరి ఏ ఒక్కరికిగాని జరగలేదని చెబుతారు.

ప్రజాపతితోబాటు ఆమె వెంట ఉండిన అయిదువందలమంది రాజకుమార్తెలూ దేహాలు చాలించారు. అందరికీ ఒకేసారి చందన కాష్ఠాలతో దహనక్రియలు జరిగాయి. ప్రజాపతి శరీరం దహనమైన చోట ఆనందుడికి ముత్యాల రాశి కనబడిందట. వాటిని జాగ్రత్తగా తీసి ఆనందుడు బుద్ధుడి భిక్షపాత్రలో పోశాడట.

• • •

బుద్ధుడికి ఎన్నో జన్మలు భార్యగా ఉండిన యశోధరాదేవి బుద్ధుడు పుట్టిన రోజునే పుట్టింది. సిద్ధార్థుడు ఇల్లు విడిచి వెళ్ళినాక తానుకూడా సన్యాసిని కావాలని ఎంతో ప్రయత్నం చేసింది, కాని శుద్ధోదనమహారాజు ఆమె ప్రయత్నాలు సాగకుండా పహరా ఏర్పాటుచేశాడు. "నీ భర్త తిరిగి వస్తాడు," అని ఆమెకు నచ్చచెప్పాడు. అత్యంత సౌందర్యవతి అయిన యశోధరను భర్త విడిచి వెళ్ళాడని తెలియగానే అనేకమంది రాజకుమారులు ఆమెను ఎత్తుకుపోవటానికి ప్రయత్నిస్తారనికూడా ఆయన భయపడ్డాడు.

ఆమె ఇల్లు వదలనప్పటికీ సన్యాసినివేషం ధరించి మట్టిపాత్రలో భోజనంచేస్తూ సన్యాస







కాలక్రమాన యశోధర అనేకమంది ఆస్తికి వారసురాలయింది. వారిలో శుద్ధోదనుడూ, మహామాయా, మహాప్రజాపతీ, సిద్ధార్థుడూ, నందుడూ, రాహులుడూ, దేవదత్తుడూ, సుప్రబుద్ధుడూ ఉన్నారు. కాని ఈ ప్రాపంచిక సంపదలపైన ఆమెకు మనస్సు విరిగిపోయింది. ఆమె మరి వెయ్యిమంది క్షత్రియ స్త్రీలను వెంటపెట్టుకుని మహాప్రజావతివద్దకు వెళ్ళింది. ఆమెను వెళ్ళకుండా చెయ్యటానికి కపిలవస్తు, కోలి నగరాల ప్రజలు ప్రయత్నించారు, కాని ఆపలేకపోయారు. వారిచ్చిన రథాలను కూడా నిరాకరించి ఆమె కాలినడకనే వెళ్ళింది.

అప్పటికి ప్రజాపతి నాయకత్వంకింద బౌద్ధ సన్యాసినులు ఒక కూడలిగా ఏర్పడ్డారు. యశోధర వారితోపాటు చేరింది.

యశోధరకు డెబ్బయి ఎనిమిదో ఏడు జరుగుతున్నది. ఒకనాటి సాయంకాలం ఆమెకు నిర్వాణం పొందాలన్న భావం కలిగింది. ఆమె బుద్ధుని వద్దకు వెళ్ళి నిర్వాణం పొందటానికి అనుమతి వేడింది. బుద్ధుడు అనుమతించాడు. ఆ రాత్రే ఆమె తన కుటీరంలో నిర్వాణాన్ని పొందింది.

మరి రెండేళ్ళు గడిచాయి. బుద్ధుడికి ఎనభయ్యో ఏడు నడుస్తున్నది. ఆయన తన

వ్రతం అవలంబించింది. బుద్ధుడు కపిలవస్తు నగరానికి వెళ్ళిన మర్నాడు తనను చూడవచ్చినప్పుడామె ఆయన శిష్యగణంలో చేరటానికి అనుమతి వేడింది, కాని బుద్ధుడు అనుమతి నిరాకరించాడు.

రాహులుడు బౌద్ధ సన్యాసి అయినప్పుడామె ఎంతో దుఃఖించింది. అప్పుడు శుద్ధోదన మహారాజు ఆమెకు హితోపదేశం చేసి ఊరడించాడు. శుద్ధోదన మహారాజు చనిపోయాక ఆమె బుద్ధుడివెంట చేరదామనుకున్నది. కాని బుద్ధుడు సన్యాసినులను తన వెంట ఉంచుకోవటానికి ఒప్పుకోవటంలేదని ప్రజాపతి ఆమెతో అన్నది.





శిష్యులనందరినీ వెంటబెట్టుకుని పావానగరానికి వెళ్ళి అక్కడ చుందుడనే ఒక కమ్మరియొక్క మామిడితోపులో విడిశాడు. ఈ సంగతి విని చుందుడు పరమానంద భరితుడై వారందరినీ తన ఇంటికి ఆహ్వానించి పందిమాంసంతో విందుచేసి పెట్టాడు.

బుద్ధుడు బుద్ధత్వం పొందేటప్పుడు సుజాత ఆయనకు ఆహారం పెట్టింది. నలభై అయిదు సంవత్సరాల అనంతరం చుందుడు ఆయనకు ఆఖరుభోజనం పెట్టాడు. ఈ ఆహారం బుద్ధుడికి వ్యాధి కలిగించింది. ఆయనకు అతిసారమూ, దాహమూ, నిస్త్రాణా పట్టుకున్నాయి. ఆయన పావానుంచి కుశీనగరానికి బయలుదేరి, ఆ పన్నెండుమైళ్ళ దూరంలోనూ ఇరవై అయిదుసార్లు విశ్రమించాడు.

ఆయన తన నిర్వాణం సమీపించిందని తెలుసుకుని తన అనుచరులతో ఆ సంగతి చెప్పాడు. బుద్ధుణ్ణి హిరణ్యవతీ నగరం అవతలి ఒడ్డున ఉన్న ఉపవర్తనమనే సాలవనంలోకి చేర్చారు. రెండు సాలవృక్షాల మధ్య ఆయన ఉత్తర దిక్కుగా తల పెట్టి పడుకున్నాడు.

బుద్ధుడు నిర్వాణం చెందబోతున్నాడని ఆనందుడు కబురుచేయగా మాళ్వరాజులందరూ ఆయన దర్శనం చేసుకోవటానికి తమ భార్యలతోసహా వచ్చారు. బుద్ధుడు ఆఖరుక్షణంలో తన శిష్యులతో, "నేను చేసిన ధర్మబోధలను గురించి మీకేమైనా అనుమానాలుంటే ఇప్పుడే అడగండి!" అన్నాడు. కాని ఎవరికీ అనుమానాలు లేవు. వారేమీ అడగలేదు.

తరవాత బుద్ధుడు కన్ను మూశాడు. బుద్ధుడి అవతారం ముగిసింది. కాని ఆయన చాటిన ధర్మాలు దశదిశలా వ్యాపించి, ఖండాంతరాలకు కూడా పాకి వివిధ దేశాల ప్రజలు ధర్మమార్గాన జీవించటానికి సహాయపడ్డాయి. —(అయిపోయింది)



CHANDAMAMA (Telugu) MAY 1959 Regd. No. M. 4854



అహింసాజ్యోతి

